భేదంబులవలనను నన్నియుఁ బ్రత్యేకంబుగాఁ జూడఁగాను మున్నూటయిరువది నాలుగు మండలంబుల పర్యంతంబు గలిగిన మండల భేదంబులు బహుప్రకారంబులుగా బహుమతంబులవారలు పలుచుచుండు రయినను సకలమతసమ్మతంబును సకల లోకప్రసిద్ధంబును సకలలోక విజ్ఞాతంబునైన యది యీ ద్వాదశ రాజమండలంబేయగు నదియెట్లనిన. 12

## ద్వాదశరాజ మండలము

సీ॥ అరియును మిత్రుండు నరిమిత్రుఁ డప్పల
 నహిత మిత్రామిత్రుఁ డహితమిత్ర
మిత్రుండు ననఁగ భూమీపతులై దుగు
 రల విజిగీషువు నగ్రమునను
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనియెడు నాతండు
 నాక్రందుఁ డనురాజు నవలి వంక
యందుఁ బార్ష్ణిగ్రాహకాసారుఁ డాక్రంద
 కాసారుఁడన నల్వు రవనినాథు

గీ॥ లరిజిగీషులభూములయందనుండు
మధ్యముఁడు వారిచెంతను మనుపఁ గట్టి
కడనుదాసీనుఁ డన్నిట ఘనుఁడు దీవిఁ
దెలియద్వాదశ రాజమండల మటంద్రు॥ 13

గీ॥ మఱియు మిత్రుఁ డుదాసీన మనుజపతియు
నరియునన నింతమాత్రనే యగుచు నుండు
మండలము పతి కీరితి మండలంబు
నొరిది గెలుచుటె మండలశుద్ధియంద్రు॥ 14

శ్లో॥ అష్టశాఖం చతుర్మూలం షష్టిపత్రం ద్వయేస్థితం।
షట్పుష్పం త్రిఫలంవృక్షం యోజానాతి స నీతివిత్॥

గీ॥ ఆకు లర్వదియును విరు లాఱు కొమ్మ
లెనిమిదియు మూఁడుదలములు మనికి రెంటి
యందు వేరులు నాలుగు నమరు మ్రాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు॥ 15

వ॥ ఇందలి యభిప్రాయము 16

సీ॥ అరివిజిగీషువు లిరువుర కగు మిత్రు
లెనమంత్రు లను శాఖ లెనిమిదియును
మధ్యమోదాసీన మానవేంద్రులు నరి
విజిగీషువును నన వ్రేళ్ళు నాల్గు
మహిని ద్వాదశరాజ మండలమున కెన్న
నై దేశ ప్రకృతుల నమరఁ గూడ
రమణ నర్వది మండలము లగు నదియును
షష్టిపత్రంబులు షడ్గుణములు

గీ॥ ననెడి విరులు నయానయ యత్నయుగళి
నెపుడు మనికి క్షయస్థానవృద్ధులనఁగ
నలరు త్రిఫలంబులును గలయట్టి మ్రాను
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు॥ 17

వ॥ ఇందుకు మఱియొక పద్యము.

సీ॥ గనులును గృషులాదిగాఁ గలయష్టవ
ర్గంబనునట్టి శాఖలును గల్గి
సామంబు మొదలైన చతురుపాయము లనఁ
బొలుపొందునట్టి వేరులును గల్గి

యల విజిగీషుమండలమున కైదేసి
ప్రకృతులతో నెనుబదియు నవియు
రచణ సర్వాది మండలము లగు నవియును
షష్టి పత్రమ్ములు షడ్గుణములు

గీ॥ ననెడి విధుల నయానయ యత్నయుగళి
నెపుడు మనికి క్షయస్థానవృద్ధు లనఁగ
నలరు త్రిఫలంబులును గల యుక్తి ప్రాసు
నెఱుఁగువాఁ డిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 18

వ॥ కావున నందు నీ చెప్పిన ద్వాదశరాజమండలంబుల యుద్ధ
క్రమంబుఁ గ్రమంబున వివరించెద. 19

మండలచరిత ప్రకరణము

సీ॥ అలవిజిగీషుపై నట్టి రాజునకును
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనెడి రాజు
నవలఁ బార్ష్ణిగ్రాహకాసారుఁడను రాజు
శత్రువు లగుదు రీజగతిలోన
నాక్రందుఁడను రాజు నాక్రందకాసారుఁ
డను రాజు మిత్రులై యొనరుచుంద్రు
కావున నచ్చోటఁ గలిగిన మిత్రభూ
వరులచే శత్రుభూవరుల కెపుడు

గీ॥ గదలఁగా రాక యుండఁ బో రొదవఁ జేసి
తనకు ముందరఁ గల్గు శాత్రవుల మీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడికొఱకు ॥ 20

సీ॥ అటులనే విజిగీషువై నట్టి భూపతి
రసికుఁడై నీతిమార్గంబు మెఱసి
తన శత్రుమీఁదటఁ దన మిత్రభూపతి
దన శత్రుమిత్రుపైఁ దనదుమిత్ర
మిత్రుఁడై నట్టి భూమీపతిఁ గవియింప
నను వారి కందఱ కవలనుండఁ
దనయరిమిత్రమిత్రుని గదలకయుండ
నటఁగృతకృత్యుఁడై యధికుఁడైన

గీ॥ యుభయమిత్రుల చేఁచి పోరొదవఁ జేసి
తనకుఁ బిమ్మటఁగల్గు శాత్రవులమీఁద
నండు గదలంగ వలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడి కొఱకు ॥ 21

వ॥ మఱియు నిట్టి విజిగీషువగు రాజు దనమిత్రులుం దాను నిద్ద రిద్దరుఁ గూడి యెడనెడనయుండెడి తన శత్రువుల నిరుదిక్కు లను జిక్కించక యుక్కడంచి జయించి మించు తెఱంగు వివరించెద. 22

సీ॥ తానును నాక్రందధారుణీపతియుఁ బా
ర్ష్ణిగ్రాహు నొవ్వఁగాఁ జేయవలయు
నాక్రందు నాక్రందనాసారు ననికంపి
పార్ష్ణిగ్రాహాసారుఁ బఱుపవలయుఁ
దనదు మిత్రుండును దానుఁ గూడుక తన
యరిరాజుఁ జెకలించి చెఱుపవలయుఁ
దనమిత్రుచేతను దనమిత్రమిత్రుచేఁ
దనయరిమిత్రుని దఱుమవలయు

ఆ॥వె॥ సుభయమిత్రుచేత నొగి మిత్రమిత్రుచే
శత్రుమిత్రమిత్రుఁ జదుపవలయు
నిటుల సహితవరుల నిరుగడ గదుముచు
గెలువవలయు నల జిగీషువునకు ॥ 23

కం॥ ఈరీతి రెండుగడలన్
సేరువుతో గెలువఁగోరు నృపతి గదిమినన్
వైరులు మెత్తురు, లేదా
వారు దనుంగొలిచి నిలిచి వర్తింతు రిలన్ ॥ 24

చం॥ తనకును వైరికిన్ సమతఁదాల్చిన చుట్టపుపంకవారి నే
యనువుననైనఁ గూర్చుకొని యందఱినిం దనవారిఁజేసికోఁ
జను నటులైన చుట్టములె చాల నలంచినయట్టిశత్రునిన్
జనపతి దా జయించుటకుఁ జాలఁగ శక్తుఁడగున్ సుఖస్థితిన్ ॥

ఆ॥వె॥ కారణములచేతఁ గాదె లోకులు శత్రు
లగుచు నున్కి మిత్రు లగుచు నున్కి
నటులు గాన శత్రు లయ్యెడికారణం
బులను విడువవలయుఁ బుడమిఱేఁడు ॥ 26

కం॥ దొర తాఁ బ్రధాన మగుచున్
ధరఁగలిగిన ప్రజలనెల్లఁ దనవారలుగా
బరగింపఁదగు నటువలెఁ
బరగిన సర్వాంగరాజ్యపదవిం జెందున్ ॥ 27

ఉ॥ దూరమునందె యుండి పరదుర్గనివాసుల మండలేశులన్
గూరిమిఁ జూపి మిత్రులుగఁ గూర్చుకొనందగు నట్లొనర్చినన్
వారలు ప్రాణబంధువులు వశ్యులునై వినయంబు పెంపునన్
దారె యొనర్చుచుండుదురు తక్కిన మండలముల్ వశంబుగన్ ॥

ఉ॥ మాటికి సర్వతంత్రముల మర్మముఁ దెల్పెడువాఁడు గల్గు నే
ప్పాటను శాత్రవుం డనుమఁ జొప్పడుఁ దొల్లి రఘూద్వహుండు నా
మేటి విభీషణుండు నలమిత్రసుతుండును గల్గఁ బట్టి యే
ప్పాటును లేక రావణునిఁ బట్టి వధింపఁడె వాలిఁ ద్రుంపఁడే॥ 39

సీ॥ బలవంతుతోడుతఁ గలహింపుచును దన
యరి ప్రయాసంబున నంది నష్టు
హృతనిధిభండారంబు నతనిబలంబులఁ
జెఱుపఁగాఁ దగుఁ దనుఁ జెఱుపకుండ
నొకశాత్రవునిఁ బట్టి పెకలించివైవ పై
నొక బలవద్వైరి యొదవెనేని
మునుపటి పగఱసే తనవానిఁగాఁ జేసి
కొని నేర్పుతోఁ గూడికొనఁగవలయు

గీ॥ కులమువారల తోడుతఁ గూడి బలియు
డండఁ గొని యుండువైరి నాతని కులంబు
వాని కొకశత్రుఁ గల్పించి వాని మిగులఁ
బెంపు సేయుచు విభుఁ డరి నొంపవలయు॥ 40

సీ॥ విసముచేతనె యొందు విసము నాశము నొందు
వజ్రంబుచేఁ దెగు వజ్ర మెపుడు
మీను మీలనుబట్టి మ్రింగుచు నుండును
గరియును గరిచేతఁ గట్టువడును
దాయాదియును దన దాయాదిచేఁ జెడు
నటుగాన రావణు నదచు నప్పు
డల విభీషణుఁ బూజ నందించి పట్టె శ్రీ
రామచంద్రుండు గౌరవము జయము

గీ॥ ఇట్టి నయరీతి నెంతయు నెఱిఁగి నృపతి
వైరిఁ జెఱిపెడికొఱకునై వైరికులజుఁ
డైనవానినె పట్టి తా నాప్తుఁ జేసి
కొనుచు మెలపున జయముఁ గైకొనఁగవలయు ॥ 41

కం॥ ఏకార్యముఁ జేయంగాఁ
జేకొనఁ దన మండలంబె చెడుబా టగుఁ దా
నాకార్య ముడుగవలయుఁ
గైకొన్నధరాతలంబుఁ గడు రంజిల్లన్ ॥ 42

కం॥ దానమున సామమున స
న్మానమున న్మెలగఁ జేయఁదగుఁ దనవారిం
బూనుకొని భేదదండవి
ధానమ్ములచేతఁ బరులఁ దండింపఁ దగున్ ॥ 43

వ॥ ఇది శత్రుమండలవర్తనప్రకారం బింక మిత్రమండలవర్తన
ప్రకారంబు వివరించెద. 44

మిత్రమండల వర్తన ప్రకారము

కం॥ క్రమమున హితాహితుల లో
కము నిండుచునుండు నములు గలరే యిది ని
క్కమపో ' సర్వస్స్వార్థం
సమీహతే ' యనఁగఁ బరగు శాస్త్రముకల్మిన్ ॥ 45

గీ॥ భోగమంది వికారంబుఁ బొందెనేని
యెంచి చుట్టంబునైన నొప్పించవలయు
మిగులఁగ వికార మొందినఁ దెగి వధింప
వలయు నిలఁ బాపకర్ముండు వైరి గాన ॥ 46

కం॥ మునుపల నుపకారియైనను
జనపాలా మిత్రుఁగాఁగఁ బాటింపఁ దగున్
మునుపల నపకారియైనను
వెనుకఁ జుట్టమైన విడుపఁ దగు జనపతికిన్ ॥ 47

కం॥ తనయెడఁ దనశత్రునియెడ
ననిశంబును బక్షపాతియై మెలఁగెడు మి
త్రునిఁ గూల్పవలయు నింద్రుఁడు
తిసుకన్ మును విశ్వరూపుఁ గెడపిన మాడ్కిన్ ॥ 48

గీ॥ అహితునకు హిత మొనరించునట్టి మిత్రు
నైన విడువంగఁ దగుఁ దన యహితుమాడ్కి
హితుల పట్టున నెవ్వాఁడు హితము సేయు
వాఁడెపో మంచిమిత్రుఁ డివ్వసుధలోన ॥ 49

కం॥ అనురక్తుండు విరక్తుఁడు
ననవల దుపకారకారి యగుమిత్రునిఁ దా
ననువుగఁ దెలియుచు దోషం
బునఁ జెందినమిత్రు విడువ భూపతి కొనరున్ ॥ 50

కం॥ కడుదొసఁ గొందని మిత్రుని
విడిచినచో నర్థధర్మవితతియు నడఁగున్
బుడమిం గావునఁ బతి యె
ప్పుడు సద్గుణములను దోషములఁ దెలియఁ దగున్ ॥ 51

కం॥ తానె నిజంబుగ నేరమిఁ
గానక మఱియాజ్ఞసేయఁగాఁ దగ దేరం
దానే నేరమిఁ దెలిసిన
చో నుచితపు టాజ్ఞచేతఁ జొప్పడుఁ బతికిన్ ॥ 52

కం॥ నేరము లేవియుఁ బొరయని
వారిని దండించునట్టివసుధావిభునిం
గ్రూర మగుపాముఁ జూచిన
తెఱుగునఁ బ్రజలెల్లఁ జూచి తిట్టుదు రెపుడున్ ॥ 53

కం॥ తగ నధికమధ్యమాధము
లగుమిత్రులతారతమ్య మరయఁగ వలయున్
దగ నధికమధ్యమాధము
లగువారలపనియుఁ దెలియనగు నధిపతికిన్ ॥ 54

గీ॥ తెలియ కెవ్వరినైన నిందింపరాదు
లేనినిందలు గట్టెడువానిపలుకు
వగిలి వినరాదు మిత్రభేదములు పూని
సేయువారలఁ బతి చేరనీయరాదు ॥ 55

కం॥ పాటించి తెలుప నోపని
మాటయు మచ్చరపుమాట మధ్యస్థంబౌ
మాటయును బక్షపాతపు
మాటయుఁ బతి లెస్సఁ దెలిసి మతి సేయఁదగున్ ॥ 56

కం॥ తనచుట్టములకుఁ బోరాం
దినవొక్కనిఁ బట్టి వాదు నెఱపక వేగం
బున వారలలో వారికిఁ
గినుకలు మాన్పంగవలయు క్షితిపతి యెందున్ ॥ 57

ఉ॥ కాలముపేర్మిఁ దా ఘనము గౌరవ మొందుచు నుండుఁ గానఁ ద
త్కాల మెఱుంగురాజు గుణకల్పన కొంత ఘటించి నీచునిన్
జాలఁగ సంస్తుతింపఁ దగు సారెకు నాతని దుర్గుణంబు లె
వ్వేళను గప్పి పెట్టుచు వివేకవిలోకనచాతురీగతిన్ ॥ 58

కం॥ తనవారిని బెఱవారిని
దనవారిగ జేసికొనఁగఁ దగుఁ జనపతి యెం
తను దా బహుమిత్రుం డై
యను వైరము సెప్పినట్లు నడతురు పుడమిన్ ॥ 59

కం॥ తన కాపద యగువేళను
దనమిత్రుండైన కరణిఁ దన బంధువులుం
దనతండ్రియుఁ దన యన్నలు
దనతమ్ములు హితముఁ జేయఁ డా రోపుదురే ॥ 60

కం॥ క్షితిలోపల నతులదృఢ
వ్రతులై తగుతనదుమిత్రవర్గముచేతన్
బ్రతివీరులైనవారలఁ
జతురతమై నిగ్రహింప జనపతి కొనయున్ ॥ 61

మ॥ ఇల నీరీతుల నీతిమార్గమునఁ దా నేప్రొద్దువర్తించి ని
శ్చలితోద్యోగమునన్ జయేచ్ఛ గలరాజన్యుండు పెంపొందుచుం
బలశుద్ధిం దగి శుద్ధమండలమునన్ వర్తించు నా శారదో
జ్జ్వలచంద్రుం డన భూప్రజాపితతికిన్ సంతోషముం జేయుచున్ ॥

వ॥ ఇది మండలశోధన ప్రకారంబు. ఇంక సంధ్యాది షడ్గుణంబుల
స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 63

## సంధివికల్పప్రకరణము

కం॥ బలియుఁ డగువైరి గదిమిన
బలువగునాపదలఁ జెంది ప్రతి సేయఁగ నే
ర్పులు లేనిరాజు కాలం
బలవడఁ గడపుచును సంధి యమరింపఁ దగున్ ॥ 64

వ॥ అదియు గొన్ని మతంబులవారు కపాలసంధి, యుపహారసంధి, సంతానసంధి, సంగతసంధి, యుపన్యాససంధి, ప్రతీకారసంధి, సంయోగసంధి, పురుషాంతరసంధి, యదృష్టనరసంధి, యాదిష్ట సంధి, యాత్మామిషసంధి, యుపగ్రహసంధి, పరిక్రియసంధి, యుచ్ఛిన్నసంధి, పరదూషణసంధి, స్కంధోపనేయసంధి, యను పదునాఱు విధంబులుగాఁ బలుకుదురు. ఇవి కొన్ని మతంబుల వారు పరస్పరోపకారసంధియు, మైత్రసంధియు, సంబంధ సంధియు నుపహార సంధియు నన నాల్గు తెఱంగులే యని పల్కుచుందు రైనను నిందులో నుపహారసంధి యొక్కటియె యీ కామందక మతంబునకు సమ్మతంబు. అది యెట్లనిన నెందును వనమీఁద దండెత్తివచ్చిన బలవంతుం డగుశాత్రవుం డెంతయైన నొకటిఁ గానుకఁ గొనక మగుడి చనండు కావున మైత్రిచేసినయైన సంధి యొక్కటి దక్క దక్కిన సంధు లన్నియు నియ్యుపహారసంధిలోని భేదంబులే యగు నైన నీపదియాఱు సంధుల స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 65

సీ॥ సమసంధియ కపాలసంధియై పొలుపొందు
యుపహార మీఁగిచే నొనరుచుండు
సంతానసంధి నాఁ జనుఁ గూఁతు నిచ్చినఁ
గడుమైత్రి నెనయ సంగతపుసంధి
కలకాల మది యొక్కగతిఁ బ్రవర్తింపుచు
సమకార్యములు గల్గి చాల మించి
యాపదలందును నధికసంపదలందు
భేదంబు చెందక పెంపుఁ జెంది

గీ॥ యలమనుష్యముఖాంతర మందునై సఁ
గట్టి కొట్టుచుఁ గాఁకలం బెట్టునెడల
నది సువర్ణంబులీలచేఁ జెదర కుండుఁ
గనుక కాంచనసంధి నా వినుతిఁ గాంచు ॥ 66

సీ॥ మంచికార్యము విద్ధతెంచి సేయుటకునై
యడరుట యది యుపన్యాససంధి
యితనికి నుపకార మే నొనర్చితి మున్ను
నతఁడు నా కుపకార మటులఁ జేయు
నుపకార మిపుడు నే నొనరించుచున్నాఁడ
నిఁకమీఁద నా కుపకృతి యొనర్ప
గలఁ డీతడని రాముఁ డెలమి సుగ్రీవున
కొనరించినట్లుగా నొప్పు నిదియు

గీ॥ ననెడు నదియును బ్రతికార మనెడిసంధి
యిరువు రొకయాత్రఁ గూర్చి తా రింపుమీఱ
సంధి సేయుట సంయోగసంధి యనఁగఁ
బరగు నీరీతు లెఱుఁగ భూపతికిఁ దగును ॥ 67

సీ॥ మనయిరువుర యోధలును గూడి మాకార్య
మిది యొనగూర్చిన నింత ధనము
మీ కిత్తుమని తాను మేకొన్న సంధి తా
నది పురుషాంతర మనెడుసంధి
మాకార్య మిది మీర చేకూర్చినను మీకు
నిట్టివస్తువులు మే మిత్తు మనిన
నది యదృష్టపురుషమ్మన దనరెడు సంధి
దేశాంశ మియ్య నాధిష్టసంధి

గీ॥ తనదు సైన్యంబుచేతనే తగ నొనర్చు
సంధి యాత్మామిషం బనుసంధి యండ్రు
ప్రాణరక్షణమునకు సర్వంబు నొసఁగి
కలసియుండుట యది యుపగ్రహ మటండ్రు ॥ ౮౮

సీ॥ భండారపం దొకపా లిచ్చి యైన నం
దిచ్చదాఁకిననొమ్మ లిచ్చియైనఁ
బసదుభండార మంతయు నిచ్చియైనను
సంధించి ప్రకృతిరక్షణ మొనర్చు
నది పరిక్రియసంధి యనఁ జెలువొందును
దనభూమిమే లెంచి తనపగఱకు
నొనగూడి యిచ్చిన నుచ్ఛిన్నసంధి యొఁ
దద్భూమి ఫల మింత దన మటంచు

గీ॥ సమర నిచ్చిన ఫలదూషణాఖ్యసంధి
ఫలమె విభజించి కందాయముల నొసంగ
నిర్ణయింపుట స్కంధోపనేయసంధి
యిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ ౮౯

సీ॥ బాలుండు వృద్ధుండు బహుదీర్ఘరోగుండు
నిజబంధుదాయాదనిందితుండు
పిఱికి యైనయతండు పిఱికిబంటై యుండు
పిఱికిబంట్లు యతండు పిసిడివాఁడు
విరసరాజ్యాంగుఁడు విషయసక్తుండను
బహుచిత్తమంత్రుండు బహువిరోధి
కరువులు వ్యసనముల్ గలిగినయతఁడును
వ్యసనముల్ గలుగుసైన్యములవాఁడు

తే॥ దైవహతుఁడు సత్య ధర్మహీనుఁడు లోభ
విడిచినతఁడు సురల ద్విజుల నెపుడు
గడవ నాడువాఁ డకాలయోధియు నైన
వంతమందు సంధి సేయఁ దగరు ॥ 70

వ॥ అది యెట్లనిన నిట్టియిరువది తెఱంగులవారును సంధానార్హులు
గాకుండుటకుం గారణంబులు గలవు వివరించెద. 71

సీ॥ బాలుండెదుటగాఁగఁ జాలనికతమున
పని సేయఁగాఁ దాన రతనిబంట్లు
తానును పని సేయ లేనివానికి నుప
కారార్థ మెవ్వండు పోరొనర్చు
ముసలివాఁడును రోగములు గల్గువాఁడు స
త్త్వాహశక్తులులేమి తమజనంబు
చేతనే భంగంబుఁ జెందుదు రెందును
విరసుఁడై జ్ఞాతుల విడచినయతఁ

గీ॥ డరిచేఁ గైవసమై యుండు నట్టిజ్ఞాతి
జనులచేతనె మున్నుగాఁ జంపఁబడును
గాన వీరెల్ల సుఖసాధ్యు లైనవార
లెట్టివారలతో సంధి నెనయరాదు ॥ 72

సీ॥ కోఁచవాఁ డని సేయఁ గొఱఁగానికతమునఁ
దనుఁ దానె వెఱచి నాశనముఁ జెందు
కడుఁ గోఁచబంట్లుల్లఁ గలధీరుఁడైన నా
బంట్లచే నాజి విష్వాటుఁ బొరయు

నరిచేత లంచంబు లంది పిచ్చతనంపు
బంటులు పతిఁ గీడుపఱతు రెపుడు
లోభి జీతము లీయ కొంగెడుకతమున
బంటులు మొగియరు బవరమునకు

గీ॥ విరసరాజ్యాంగుఁ డరులతోఁ దురమొనర్చ
విసివి రాజ్యాంగములు వాని విడిచి పెట్టు
విషయసక్తుని గడు సుఖవృత్తి గెలువ
వచ్చుఁ గావున వీరితో వలదు సంధి ॥ 73

సీ॥ బహువిచారంబులు బహుచిత్తములు గల్గు
పతిమంత్రులకు నెల్లఁ బగతుఁ డగుచు
చలచిత్త మిందుటవలనఁ గార్యంబుల
యెడ వారిచేతనే విడువఁ బడును
పెక్కుడేగలయందుఁ జిక్కుపావుర మన
బహువైరి యగువాఁడు పదరి బెదరి
యెట్టిత్రోవలఁ బోవు నట్టిత్రోవలయందె
ప్రుక్కి శాత్రవులచేఁ జిక్కుపడును

గీ॥ కఱువు వ్యసనంబులును జెంది కలఁగువాఁడు
కోలుకోలేక తనుఁ దానె కూలుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లట్టివారలతో సంధి నెనయరాదు ॥ 74

సీ॥ వ్యసనముల్ గలిగినయట్టిబలంబులు
గలవాఁడు పోటు కెక్కఁగ లేఁడు
దైవోపహతకుఁడు తనుఁ దానె చెడుచుండు
సత్యంబు ధర్మంబు సడలినయతఁ

తనువుగా సంధి గైకొనినమీఁదట నైనఁ
బదరుసుఁ దా మల్లబడి కలంగు
తలము దప్పినయట్టి దంతావళము నీటఁ
గొంచెపుమొసలిచే గుదిసినట్లు
గీ॥ నెలవు దప్పినయాతండు సలఁగి క్షుద్ర
శాత్రవునిచేతనైనను సమయుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 75

సీ॥ దేవుళ్ళఁ బాపలఁ దిట్టునాతఁడు ధర్మ
హీనుండు గావున నీల్గుచుండుఁ
గనుఁగొనలేక చీఁకటిలోనఁ గాకంబు
ఘూకంబుచేతను గూలినట్లు
కాల మెఱుంగక కలహించునాతండు
గాలజ్ఞయోధచేఁ గూలుచుండు
నాపదలకు మఱి యధికసంపదలకు
దైవంబె కద నిమిత్తం బటంచు
గీ॥ దైవచింతకుం డన్ని యత్నములు మాని
యూరకుండియు చెడుచుండు నుర్విలోనఁ
గాన వీరలతో సంధి గాదు తలఁప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 76

సంధి కర్తలగువార్లు

గీ॥ ఆర్యుఁడును ధార్మికుండు ననార్యుఁ డధిక
బలుఁడు దాయాదవర్గంబు గలుగునతఁడు
సత్యవంతుండు బహుజయశాలి సంధి
కర్తలని పల్కుదురు నయజ్ఞులెందు ॥ 77

వ॥ అది యెట్లనిన, నిట్లు సంధానార్హులైన యేడుగురి తెఱఁగును
క్రమంబున వివరించెద. 78

సీ॥ ఆప్యుఁడై తగువాఁడు ప్రాణబాధలయందుఁ
దనమంచితనమె వదలకయుండు
ధార్మికుండెంతయు దనధర్మమహిమచేఁ
గడుఁ బ్రజానురాగంబు గడనకతన
నతఁడెవరించిన నతనికై యందఱు
నని యొనర్తురు కాన నతఁడనాప్యుఁ
డగు ననార్యుండైన యతఁడు గూడకయున్న
నతఁడు శత్రులఁగూడి యడఁగఁజేయు

గీ॥ మొదలు ముట్టంగఁ బరశురాముని విధమున
నిట్టివార లసాధ్యులౌ పెక్కుగి యందు
సంధి గావించవలయు నీజగతిలోన
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 79

సీ॥ అధికుఁడెంతయు నన్ను నాక్రమించినచోట
నెన్నియత్నంబుల నెనసినైన
నతఁడు దా బలసింహమాక్రమించినలేఁడి
లీల నెంమను దిక్కులేకయుండు
నధికుతో నేమాత్రమైనను గినిసిన
నప్పుడు మొదలంట నప్పుడె చెడును
బలవంతుతోడుతఁ గలహించుమని నీతి
శాస్త్రంబు బలుకు చెప్పుటనులేదు

గీ॥ మొనపి పెనుగాలి కెదురని మొగిలు కరణి
నధికుతోనల్పుఁడెదురలేఁ డటులఁగాన

బ్రతుకవలసిన భూపతి బలియుతోడ
సంధిసేయంగవలయు నిశ్చయముగాఁగ ॥ 80

ఆ॥వె॥ అధికుఁడెటుల శత్రుఁడై వేఁరైనచో
విక్రమించునట్టివిధమునిసియలు
చెంపివెలయు గట్టుచెంతఁ బ్రుంతఁజెంది
యుకలఁ బ్రబలునపులయందు నుండి ॥ 81

సీ॥ దాయాదవర్గంబు దనకుఁగల్గినవాఁడు
కడుమూఁకఁజెందిన కారణమున
భేదింపరాకుండుఁ బెనుమోండ్లు బలసిన
వెదురులపొదలోని వెదురుమాడ్కి
సత్యవంతుఁడు దన సత్యంబు నడుపుచు
సంధికృత్యంబుల జారకుండు
గెలుపుకెయ్యేడఁ బెక్కుగలవాఁడు దొరకైనా
పరశురామునిఁ బ్రతాపమునఁ బోలి

గీ॥ యతనిశౌర్యంబుచేతనే యఖిలదిశల
మించుభూపతులెల్లఁగంపించియుందు
రిట్టివార లసాధ్యులౌ కైటిఁగి విభుఁడు
సంధిసేయంగవలయు నీజగతిలోన ॥ 82

కం॥ పెక్కు జయంబులు గల దొర
నొక్కటిగా సంధిగూర్పు నుర్వీ విభునిం
దిక్కులి గొల్తురు వైరులు
చక్కనగాఁ దత్ప్రతాపసంతాపితులై ॥

ఆ॥వె॥ సంధియయ్యెననుచు సత్యవంతులనైన
నమ్మియుండఁ జనదువరవరునకుఁ

జేయరానిబాసనేసియు నింద్రుండు
వృత్రుఁ జంపినట్టి విధమెఱింగి ॥ 84

ఆ॥వె॥ తనయుఁడైన సనుఁగు దండ్రియైనను రాజ్య
మంది యొకవిహార మొందుఁ గాన
లోకజనముచర్యలోనిది గాకుంట
ధరణిపతులనడకఁ దలఁప వలయు ॥ 85

కం॥ బలవంతుఁ డెత్తివచ్చిన
నలుకక దుర్గమున నిల్చి యంతటికంటెన్
బలవంతుఁదెచ్చి తఱుమఁగ
వలయుఁ బటాపంచముగ నవారితశక్తిన్ ॥ 86

వ॥ మఱియు భరద్వాజమతంబున. 87

కం॥ తనయుత్సాహము బలిమియుఁ
గనుఁగొని యరిమీఁద నుఱికి కలహింపఁ దగున్
ఘనసింహ మెదిరి మదకరు
లను వెంటాడంగఁ జూసులాగున నెందున్ ॥ 88

కం॥ ఉదుటుగల సింహ మొక్కటి
మదగజ సంఘములఁ గెల్చుమాడ్కిఁ బగఱపైఁ
బొదలిన తనయుత్సాహము
నుదుటుం గని గమకమునను నుఱకఁగవలయున్ ॥ 89

కం॥ కడునల్పనైన్యనైనను
బడలికఁబడి యొక్కశత్రు భంజించినచో
బొడవైనశత్రునుత్సాహము
కడిమినె యిల నితరశత్రుగణముం బొగడున్ ॥ 90

కం॥ సముతోడ నైనసంధియు
నమరుం గెలుపోటమియును ననిలో సందే,
హముగన నిట్లనె పలుకఁడె
యమరగురుఁడు నిశ్చితార్థ మది కాదంచుణ్ ॥ 91

చం॥ బలియుఁగఁ గోరురాజు సమబల్మికి మున్నుసమానవైరితోఁ
జలమునఁబోరఁగాఁ జనకసంధియె చేయుట మేలు కానిచో
నలవడఁ బచ్చికుండ మెరయంబడి రెండుగవ్రీలుకై వడిణ్
బొలియుచె కాక గెల్పులను బొందుట లెందును జెందనేర్చునే॥

ఆ॥వె॥ సముల మనుచు బదరి సందిసేయక మీఱి
పోరి యిరువురొకట బొలియరైరె
పంచశైనయట్టి సుందోపసుందులు
గాన సములు సంధిఁ బూన మేలు ॥ 93

ఆ॥వె॥ తనకు వ్యసనమైనతఱి హీనుఁడెత్తిన
సంధిసేయఁదేని చాలఁగీడు
తడిసినట్టివానియొడలిపైనొకమంచు
బొట్టుబడిన వడఁకు పుట్టకున్నె ॥ 94

కం॥ హీనుఁడగు వైరి యెడలం
దా నెంతను వ్యసన మెడలుతఱి సంశయము
న్మానుచు నిర్దయుఁడై పతి
వానియవిశ్వాస మెఱిఁగి వధియింపఁదగున్॥ 95

సీ॥ అరి కడుబలవంతుఁడైన సంధియుఁ జేసి
చేరి విశ్వాసంబుఁ జెంద నడచి
తాను నమ్మినయట్టివానికై వడి ముందె
తపయించిలాకునతుల్ గనఁగనీక

తగుప్రియంబులె పల్కుచనదుశౌర్యము తన
కనువైనవేళ సేయంగ వలయు
నదియటులన్న నట్లనుసరింపుచుఁ దొల్లి
విశ్వాస మందించి వేళయెఱిఁగి

గీ॥ ఘనుఁడు దేవేంద్రుఁడుం దితి కడుపుఁజొచ్చి
కసుపుకోనున్న పగఱ ద్రక్కలుగఁ జీఱి
యల మరుద్గణకర్తయై యతిశయిల్లె
నిట్టిమార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 96

సీ॥ బలవంతుఁడగురాజు చలమునఁ బైనెత్త
నాతనియువరాజు నతనిమంత్రి
తోనైనఁ దాను సంధానంబు గావించి
వారిలో వారికిఁ బోరుఁబెట్టి
యదియును గాకున్న నతనిప్రధానున
కెంతయుఁ దా ధనమిచ్చియైన
వలయు నర్థముల లేఖల నిచ్చి యైనను
బరునియత్నంబులు సెఱుపవలయు

గీ॥ నిన్నిరీతులఁగార్యంబు లెసఁగకుండఁ
జేయఁ గడుసుగ్రుఁడై వైరచెంతనుండు
వారిపై నెల్లను గడువిశ్వాస మొంది
యతఁడు సేసిన యత్నంబు లతఁడెమాను ॥ 97

కం॥ అరియత్నము లుడుపఁగఁ దగు
పరిమిత్రుల సంధిచేసియైనను లేదా
యరివైద్యుల భేదింపుచు
నరిఁ జెఱుపఁగవలయు ఘనవిషాదులనైన ॥ 98

వ॥ ఇట్టి యత్నంబులు చేసినను బెట్టిదుండగునట్టిపగఱ మట్టుఁ బడక
బిట్టు గదిమినయేని వెండియు, 99

సీ॥ బహువేషభాషలఁ బరగినవారలై
యాభిచారికనిమిత్తాదు లెఱిఁగి
యాశత్రుదేశంబు నందె కాపుర ముండి
సంచరించెడు వనచరులచేత
నొకకొన్ని ప్రశ్నలు నొకకొన్ని శకునముల్
కడు నిదర్శనములుగాఁగఁ దెలుపఁ
జేసి శత్రుల విశ్వసింపఁ గావింపుచు
వారిచేతనె బహువ్యసనములును

గీ॥ భీకరోత్పాతములును గల్పింపఁజేసి
యిట్లు శత్రునియుత్సాహమెల్లఁ జెఱచి
వానిఁ దోఁదోలవలయు నవార్యమహిమ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 100

గీ॥ పుత్రమిత్రకళత్రాప్తసహాయవిత్త
వాహనాదులు గదనంబువలస నొక్క
నిమిషమున వ్యర్థమగుట లో నృపతి యెఱిఁగి
మిగులఁ గలహంబులకుఁ బూని మెలఁగరాదు ॥ 101

కం॥ బలమును ధనమును జుట్టం
బులు నిజదేహంబు రాజ్యమునుఁ గీర్తితతుల్
దలఁకుచు సంశయదోలా
కలితముగాఁగనె వివేకి కదనమొనర్చున్ ॥ 102

సీ॥ తనసరిదొరయైనఁ దనమీఁద దండెత్తి
తనతోడ సంధిగై కొనకయున్నఁ
దా నటమీఁద నాతనితోడ సంధి గా
వలసెనమాఁదెయ్యె వైర ముడిగి

కాలోచితంబైన క్రమమున సామదా
నంబులచేత భేదంబుచేత
నట్టు మట్టుఁనడసుండి యామీఁదఁదా మించి
యరి కసాధ్యంబైనయచట నిలిచి

గీ॥ చతురగతిఁ బొల్చి సన్నాహసహితసైన్య
పటలిచేతను జీకాకుపఱుపవలయు
సతఁడెటులఁ దప్పఁడై కోరు సంధుల వినుఁడు
'తత్తయోస్సంధి' యనెడి శాస్త్రంబెఱింగి ॥ 103

కం॥ ఈరీతి సంధికార్యము
దారు వచింపుదురు మునులు తత్సంధి బలా
త్కారమునసైనఁ గార్యము
గౌరవలాఘవము రెఱిఁగి కావింపఁదగుఁజా ॥ 104

వ॥ ఇది సంధిస్వరూపంబు. ఇంక విగ్రహస్వరూపంబు వివరించెద.

విగ్రహ వికల్ప ప్రకరణము

కం॥ తమలోఁ దా రెప్పుడు కో
పముల ననూయలను బెరసి పలుమరు నపకా
రములె యొనరించుటలచే
నమరంగాఁ బొడము విగ్రహము మహిలోనఁజా ॥ 106

ఆ॥వె॥ ఫలముగోరువాఁడు పగవారిచేతను
వెతలఁ జెందువాఁడు చతురుఁడగుచు
నహితుతోడ విగ్రహము సేయవలయును
బలము దేశకాలబల మెఱింగి ॥ 107

వ॥ ఇట్టి విగ్రహంబు స్థానాపహారంబువలనను రాజ్యాపహారంబు
వలనను, వనితాపహారంబువలనను, గ్రామాపహారంబువలనను,

ర్థవిఘాతంబువలనను, ధర్మవిఘాతంబువలనను, జ్ఞానాప హారంబువలనను, జ్ఞానశక్తివిఘాతంబువలనను, మిత్రార్థంబు వలనను, నవమానంబువలనను, నభిమానంబువలనను, బంధు నాశనంబువలనను, నేకార్థప్రీతివలనను, ధనాపహరణంబువలనను, గృహీతానుగ్రహభేదంబువలనను, దైవంబువలనను, ప్రకృతి క్షోభంబువలనను, దేశపీడనంబువలనను, బహుజనద్వేషంబు వలనను, గలుగుచునుండు నిందుకు శమనప్రకారంబెట్లన్నను గ్రమంబున వివరించెద. 108

సీ॥ స్థానరాజ్యములకు సతులకు మఱియు దే
శములకుఁ గా వచ్చు జగడమెల్ల
పుచ్చుకొన్నవి మళ్ళ నిచ్చుటచే నొరుల్
గైకొన్న దమయుక్తిఁ గనుటచేత
నర్థంబు ధర్మంబు నడపఁటో రాదవఁదొ
ల్తటియట్ల యిచ్చి యేర్పుటలచేత
జ్ఞానాపహారంబు జ్ఞానశక్తివిఘాత
ముల నైన జగడంబు చలము కొనక

గీ॥ పట్టునర్థంబు వదలి చొప్పడుటచేతఁ
దనకొనర్పు నుపేక్షచేఁ దాల్మిచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 109

సీ॥ ద్రోహం బధర్మంబుతోఁ గూడుమిత్రువి
కలహంబుఁ దనయుపేక్షణముచేత
నెవ్వనవమంచిమిత్రునికైన జగడంబుఁ
దవదిగా క్షమియించుకొనుటచేత

అవమానమునఁ గల్గు నావిగ్రహం బను
నయముతోఁ గూడుమానంబుచేత
అభిమానమునఁ బుట్టినట్టి వైరంబు సా
మంబుచేతను బ్రణామంబుచేత

గీ॥ బంధునాశంబువలనఁ జొప్పడినపోరు
వగిన యట్టి రహస్యవర్తనముచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 110

సీ॥ ఏకార్థమునకుఁగా నిరువుర కగుపోరు
తనకోర్కి వదలి పీడ్కొనుటచేత
ధనముఁ గైకొనుటచే నొనరినజగడంబు
క్రోధంబుఁ జాలించుకొనుటచేత
నదరి చేయుననుగ్రహము మాన నగుపోరు
మగుడి యనుగ్రహమహిమచేత
దైవికగతిచేతఁ దనకైనజగడంబు
దైవంబు గూర్చుయత్నంబుచేత

గీ॥ మండలక్షోభమున్నైన మచ్చరంబు
నందుకొనఁగూడి తగుమపాయములచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 111

సీ॥ మించి దేశంబు బాధించఁగా నైనపో
రతనిదేశముఁ గూల్చునందుచేత
బహుజనంబులతోడఁ బరగినజగడంబుఁ
దగుసామదానభేదములచేత

మానుషంగావలె మఱి యిట్లు పొడమెడి
కలహముల్ దా మాన్పఁగదఁగఁదేని
సర్వంబు నొకవేళఁ జాల నాశనమొందుఁ
గాపునఁ గడు విచక్షణత మించి

తే॥ యేయుపాయంబుచేఁ బీడ యెసఁగకుండ
నాయుపాయంబుచే విగ్రహంబు లెల్ల
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 112

వ॥ మఱియుఁ గొన్నిమతంబులవారు శత్రుప్రవర్తనమువలనను. గ్రహంబులవలనను. వనితలవలనను. వాగ్దోషంబువలనను. నపరాధంబువలనను. బుట్టెడి వైరంబు లైదువిధంబులే యని పల్కుచుండుదురు. బాహుదంతితనూజుండు భూమియొక్కి యడ్డగించుటవలనను. భూమిబాధ గలుగుటవలనను. శక్తి చెఱుచుటవలనను. గడిరాజువలననుం బొడమెడి వైరంబులు నాలుగువిధంబులే యని పలుకుచుండు. మనుమతంబువారు కులమువలనను నపరాధంబువలననుం బొడమెడి వైరంబులు రెండువిధంబులేయనియును బలుకుచుండుదు రైన నందుఁబూని రాని విగ్రహంబులు బదియాఱువిధంబులు గల వవి యెట్లనిన.

సీ॥ అల్పఫలంబైనయది నిష్ఫలంబును
ఫలము నిశ్చయలీలఁ బరగునదియు
నపుడు దోషముగల్గి యామీఁద ఫలమిచ్చు
నదియును దోషంబు లపుడులేక
యటమీఁద ఫలయుక్తి నలరకుండెడునది
యపుడు మీఁదట. దోష. మందునదియు।
దా నెఱుంగనికూరతను ఖించువానిది
పరులు ప్రేరేపఁ జొప్పడత్తునదియును

ఆ॥ నొరల కొఱకై నయదియును దెఱవకొఱకుఁ
గాఁగవచ్చినయది దీర్ఘకాలమదియు
నైనవిగ్రహముల నెల్ల మానవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 114

సీ॥ బ్రాహ్మణోత్తములతోఁ బరగిన నదియును
వేళ గాకుండెడివేళ నెందు
దైవబలంబుచేఁ దగువానితోడిది
కలహంబునకె నిచ్చఁ గాలు ద్రవ్వ
వెలికాండ్రు గల్గినక్షితిపతితోడిది
తత్కాలఫలయుక్తిఁ దగుచునుండి
యామీఁద నిష్ఫలమైవచ్చునదియును
తత్కాలఫలయుక్తిఁ దగులనీక

తే॥ యంతమీఁదట ఫలయుక్తి నమరునదియు
ననఁగఁ దగినట్టి పైపదియాఱుతెఱఁగు
లైనవిగ్రహముల నెల్ల మానవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 115

ఆ॥ చేయునప్పుడు మీఁదటఁ జేటులేని
విగ్రహమ్ములె యెపుడుఁ గావింపవలయు
నవియ కావన్నిపనులందు నటులఁ గాఁగఁ
దలఁచి మెలఁగంగవలయు నిచ్చలు విభుండు ॥ 116

ఉ॥ అప్పుడు మీఁదటన్ ఫలము నందఁగఁ జేయువిశుద్ధకర్మముం
దప్పక యాచరించుజననాథుఁడు నిందలఁ జెందకుండుఁ దా
నెప్పుడు నట్లుకావున మహీస్థలిలో విహముం బరంబుఁ దాఁ
117 జొప్పడఁ గూర్చునట్టిపని సొంపునఁ జేయఁగ నొప్పుఁ బ్రాజ్ఞుఁడై ॥

చం॥ ఒకయినుమంతయర్థమునమందెడు లోభముచేఁ బరంబుఁబెం
చక డిగ నాడఁగావలదు తత్పరలోకవిరుద్ధకర్మలం
బ్రకటముగాఁగ చవ్వులనె పాయుట మేలగు నిట్టి లాగుబు
బ్రకరము నబ్బఁగావున నృపాలుఁడు సత్క్రియఁజేయుచేతగుణ

సీ॥ బలము పోషణ మంది చెలఁగియుండెడివేళ
నమర క్తిమై బ్రజల్ దనరువేళఁ
దాను జూచినమాపు దైవ మీడేర్చుచోఁ
దనమిత్రు లతిభక్తిఁ దనరువేళ
సకలసామంతులు సంధిఁగోరెడివేళ
నాప్తమంత్రులు గలయట్టివేళ
ధనధాన్యములు చాలఁ దన కొనఁగూడుచో
నుత్సాహ మాత్మలో నుబ్బువేళఁ

గీ॥ బరుల కిటుపంటి వెల్లఁజొప్పడనియట్టి
వేళ నొనరింపఁగాఁదగు విగ్రహంబు
ధనము మిత్రుండు భూమి నాఁ దగినమూఁడు
గతులఫలముల నొకటైనఁ గలుగఁదెలిసి ॥ 119

ఉ॥ మేలు ధనంబు ధాత్రిపయి మించువస్తులకన్న నంతకున్
మేలు దలంప మిత్రుఁ డలమిత్రునికంటెను భూమి మేలగున్
మేలగుభూమిచేతఁ గడుమేలగు సంపద గల్గు సంపదన్
జాలఁగ బంధుమిత్రులును సద్గుణజాలము గల్గు నెప్పుడున్ ॥

కం॥ తనతో సమసంపదచే
సమసాంద్రైశ్వర్యశత్రుజనముల నప్రతిహతమై
తనరుసుసాధ్యుష్మచేతనె
జనపతి శిక్షింపవలయుఁ జత్రుల దగుచున్ ॥ 121

కం॥ కలహంబై న నుపాయ
మ్ములచేతనె తాళి శాంతిఁబొందింపఁదగుఁజా
గెలుపులు దలఁప ననిశ్చయ
ములు గావునఁ ద్వరితగతుల మొనయకి నృపతుల్ ॥ 123

సీ॥ బలవంతుండగు శాత్రవుండు గినుకజా బైపచ్చి శోధించినా
గలఁగజాబాలక నిత్యసంపదల నాకాంక్షించుచుఁజాబు ద్విఁ
శ్చలతజా వై తసవృత్తిచే వినతుఁడై శత్రుం బ్రసన్నాత్ముఁగా
నలరింపందగు సర్పవృత్తు లటు పాయంబెట్టి సేరొందుగజా ॥

తే॥వె॥ పామురీతిఁ గ్రూరభంగిఁ జరించిన
విభుఁడు నాశ మందు వేగ జగతి
సిరులఁ జెందుచుండుఁ దిరముగాఁ బ్రబ్బుళ్ళ
లీల వినయవృత్తి వాలునతఁడు ॥ 124

ఆ॥వె॥ మత్తురీతి వెత్తిమాడ్కిఁ దా నూరక
యుండివేళఁబైకి నుఱికి సింహ
మటులఁగ్రమముచేత నందినయది జాఱ
కుండఁబట్టి విజయ మొందవలయు ॥ 125

సీ॥ తాఁబేటిలీల యొంతయును ముడుంచుక
తనమీఁదవచ్చు బాధలకుఁదాళి
గట్టుకై వడి విల్చి కదలక యోర్చుచు
ననువుగాకుండెడియట్టివేళ
యరిని మూపునఁబెట్టియైన మోవఁగనేర్చి
ప్రియభాషణంబులఁ బేలుపఱచి
కడుప్రసన్నాత్ముఁడై పుడమిపాత్తె లెఱింగ
యరియంతరంగంబునందు విల్చి

ఆ॥వె॥ సమయమెఱఁగి కృష్ణసర్పంబుగతిఁ జిట్టు
మనుచు నొడిసి యగ్నియటుల భగ్గు
రనఁగ నెగసి నీతియసుచేత ముందలఁ
బట్టి తివియవలయుఁ బరులసిరుల ॥ 126

ఉ॥ నిలుకడఁగాంచి మేలెఱుఁగునేర్పు వహించి పరాక్రమంబునన్
గులమున మించి సత్యమునఁగూడఁగ ధైర్యదయాతిదానస
త్కళల వరించి యూర్జితుఁడు గౌరవశాలియునైనరాజు ని
చ్చలు నిలశత్రురాజుల కసాధ్యుఁడగున్ మదినెంచిచూడఁగన్ ॥

చం॥ పరుసముఁబల్కి మేల్మఱచి బాసలుదప్పి భయంబుఁజెందుచున్
గరువము దుఃఖమోపమియుఁ గల్గి ప్రమాదము జాగుచందమున్
విరసముఁజెంది జూదముల వేఁటల నింతులఁ బానలీలలన్
నిరతము నాచరించు నవినీతుఁడు సంపదఁజెందనేర్చునే ॥ 128

చం॥ గెలువగఁ గోరునట్టి దొర కీడుగుణంబులు గల్గుశత్రుపై
నలవుమెయిం ద్రిశక్తియుతుఁడై చనఁగాఁదగు నట్లుగాక ని
శ్చలగుణశాలియై తనరుశత్రుని మీఁదట నెత్తువాఁడు నే
ర్పులఁదనుదానె చంపుకొనఁ బూనుచునుండును నిందకర్హుఁడై ॥

చం॥ ఘనమగు రాజ్యసంపదలు గైకొను నిచ్ఛఁజెలంగి బుద్ధిచే
నమవగుమండలక్రియలనన్ని యెఱింగి దృఢప్రయత్నుఁడై
పనివడి విగ్రహస్థితులఁ బాగుఁజెందుచుఁ గార్యసిద్ధికై
యనిశముఁ బూనఁగావలయు నద్భుతశౌర్యసమగ్రచర్యలన్ ॥

వ॥ ఇదియు విగ్రహస్వరూపంబు. ఇంక యానప్రకారంబెట్లనిన.

## యానప్రకరణము

గీ॥ అధికబలవిక్రమంబుల నలరి ప్రకృతు
లాత్మగుణముల ననురక్తి నంది కొలుప
విజయమందుట కలమహీవిభుఁడు రిపుల
నడఁచుటకు దండువెడలుట యానమండ్రు ॥ 132

వ॥ అదియును విగృహ్యాయానంబును, సంధాయయాసంబును, ప్రసంగయాసంబును సంభూయయానంబును, నుపేక్షయానంబు ననియైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు గ్రమంబున వివరించెద. 133

సీ॥ బలవంతుఁడరిప్రధానుల విగ్రహించి దం
డెత్తుటయును దనహితులచేత
నరిమిత్రులను నొంచి యరిమీఁద దండెత్తు
నదియును విగ్రహయానమండ్రు
వెనుక శత్రులసంధి నొనరి యన్యుల మీఁద
నరుగుటయును దను నడ్డకట్టు
విమతులు సంధించి వేఱొక్క యరిమీఁద
నరుగుట సంధాయయాన మందు

గీ॥ రొక్కచోటికిఁ గదలి వేఱొక్కయెడకు
శల్యురీతిఁ బ్రసంగవశంబు కతనఁ
జనినయది ధాత్రియందుఁ బ్రసంగయాన
మండ్రు నయశాస్త్రవిదులై నయార్యులెందు॥ 134

సీ॥ శౌర్యశక్తులమించి చాల మూఁకలగూల్పఁ
గలిగిన సామంతగణము తోడఁ
గలసి శాత్రవులను గదుమ నుద్యోగించి
కదలిపోవుట చూడ నదియుఁగాక
ఫలమిత్తునని ప్రతినలు పల్కి కొంచెపు
దొరలతోఁ గూడుక యరుగునదియుఁ
దనప్రకృతుల నొంపఁ దా రిరువురు గూడి
యిరువురు శత్రుల నే పడంప

తే॥ మునుపు సూర్యాంజనేయులు సనివరీతి
నరుగుటఁ దలంప సంభూయయాన మందు
రిట్టి యానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 135

సీ॥ శత్రుపై దండెత్తి చనుచోట సహితున
కపుడు సహాయుఁడై యతనికంటె
బలవంతుఁడగురాజు పైనెత్తివచ్చిన
మునుపటిశత్రుపైఁ జనక తాను
వాని నుపేక్షించి వానిసహాయుపైఁ
జన నుపేక్షయాన మనఁగఁ బరగు
వాసవసూతి నివాతకవచులపైఁ
జని యుపేక్షయానమునసె తొల్లి

తే॥ ప్రబలులై మించినట్టి హిరణ్యపురని
వాసులను గెల్వఁగదలిన వైపు దనర
నిట్టియానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 136

తే॥ అరికి వ్యసనంబు గల్గినయట్టివేళ
నరికి దైవంబు దోడుగానట్టివేళ
నదనుఁ జేకొని దండెత్త నర్హ మంత్రు
నీతిమార్గం బెఱింగిననృపవరునకు ॥ 137

ఆసన ప్రకరణము

వ॥ ఆసన ప్రకారంబు. 138

కం॥ అరియును విజిగీషుఁడరా
వర లిరువురు బలిమికలిమి వడినొండొరులన్
దెరలింపలేక యుండుట
ధర నాసన మనఁగఁ బరఁగుఁ దత్త్వజ్ఞులచేతన్ ॥ 139

వ॥ అదియును విగృహ్యాసనంబును సంధాయాసనంబును బ్రసంగాసనంబును, సంభూయాసనంబును, నుపేక్షాసనంబును నన నైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు గ్రమంబున వివరించెద. 140

సీ॥ ఒక్కరొక్కరిసీమ లొండొరుల్ గైకొని
మెండొడ్డి యెత్తిపోకుండుటయును
గడువైరితోడ విగ్రహమంది వాఁడు వ
ర్గస్థుఁడై సాధ్యుండు కానివేళ
ధాన్యాదికము మిత్రశతులను గట్టియల్
గనపును జొరకుండఁ గాఁచియుండి
ముట్టడిగాఁ జుట్టుముట్టుకొనుచునుండు
నట్టిదియును విగృహ్యాసనంబు

గీ॥ వైరిపై నిట్లు ముట్టడి వైచి యెంచి
ప్రకృతు లన్నియుఁ జెడఁ బాపి పగఱఁ దనకుఁ
గైవసము చేసికొనఁదగు కాలమెఱిఁగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 141

సీ॥ రావణాసురుఁడు పూర్వమున నివాతక
వచులతోఁ బోరాడి వారుఁ దాను
నలసి చతుర్ముఖు నంపి సంధి యొనర్చి
నట్టులు విజిగీషు నరియుఁ బోరి
యలసి సంధియొనర్చి కలసియుండుటయు సం
ధాయాసనంబనఁ దనరుచుండు
నది గాక యరిమీఁద నలవునఁ గదలి పే
తొకప్రసంగము చెంది యొరునిమీఁద

గీ॥ కదలఁగ వలదె త్రిపోయిన తా వడిసియుండు
నది ప్రయాణాసనం బను నమరుచుండు
నిట్టి చందంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

సీ॥ అరివిజిగీషుపంఁ దా నాక్రమించుటకు మ
ధ్యముఁడు పై దండెత్తఁ దలచినప్పు
డరియును విజిగీషు వన్యోన్యమైత్రిచే
నొనగూడి బల్మిచే నుండు టొప్పు
నదిగాక మధ్యముఁడైన యుం యుదాసీనుండు
గని సిన నరివిజిగీషువులను
బక్కనవారెల్ల నొక్కటైయున్న నం
ఘాయాసనం బనఁ బొలుపుమీఱు

గీ॥ నిట్టిభేదంబులెల్లను నెపుడు చిత్త
మందెఱుఁగనుండ నేర్చిన యట్టిరాజు
మదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతించ మించి యిజ్జగతి నేలు ॥ 143

సీ॥ బలియుఁడై కృష్ణుండు పారిజాతముఁ దెచ్చు
చోట నుపేక్షించి సురవిభుండు
పదరకయున్నట్లు పగతుఁడు బలియుఁడై
యున్నచోఁ దా నూరకుండునదియు
నొకహేతువునఁ జేసి యొకశాత్రవుఁడు పేర్చి
తను నుపేక్షించిన దానిఁ గొనుచు
మును రుక్మియుండిన యనువున నుండుట
యది యుపేక్షాసన మనఁగఁ దనరు

గీ॥ సంధిభేదంబు లెల్లఁ దా నెపుడు చిత్త
మం దెఱింగియుండ నేర్చినయట్టి రాజు
ఘనరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతింప మించి యీజగతి నేలు॥ 144

## ద్వైధీభావ ప్రకరణము

వ॥ మఱియు ద్వైధీభావంబు స్వతంత్రపరతంత్రభేదంబున రెండు
దెఱంగు లయ్యె నందు స్వతంత్ర ద్వైధీభావం బెట్లనిన. 145

సీ॥ ఇరువురిక్కాలకుఁ దన కిద్దఱుశత్రులు
బలవంతులై యున్నఁ గలఁకపడక
వారివారికిఁ జూడ వారివాఁడను బోలెఁ
దన్నుఁ దక్కొకటిగా నెన్నిపల్కి
కాకాక్షివలె నిరుగడల వర్తింపుచు
సంధిఁ జేయవలదాన నధిపయత్న
మున గడుపుచు నిద్దఱెనయక యొత్తిన
సందులో బలవంతు నాశ్రయించి

గీ॥ వారి నిద్దఱు వదలిన వారియరులఁ
దాన బలవంతు నొక్కనిఁ బూని గొలిచి
సడవఁగా నేర్చి కాలంబు గడపెనేని
యది ద్వైధీభావగుణ మని యండ్రు బుధులు॥ 146

కం॥ సాధారణుఁడై యిరుగడ
క్షుధాధిపులకు నెనపి ధనముఁ బొరయుట యది వా
సిధారుణిఁ బరతంత్ర
ద్వైధీభావం బనంగఁ దగుఁ దజ్ఞులచేన్॥ 147

## సమాశ్రయ ప్రకరణము

క॥ మతియు సమాశ్రయగుణంబు బలవంతుండగు నితఁడైనను
గాక పరశత్రువునైన నాశ్రయించుటం జేసి రెండు విధంబులై
యుండుఁ దత్ప్రకారం బెట్లనిన. 118

సీ॥ బలవంతుచే నొంపఁబడి నిరుపాయుఁడై
ప్రతిసేయఁగా లేక బలిమినపుడు
కులమును సత్త్వంబు బలమును గల్గిన
యార్యుని నొక్కని నాశ్రయించి
వినయంబుతో నిత్యమును దొడగని చేరి
యుతనిభావం బెల్ల నాత్మ నెఱిఁగి
చెప్పినకై వడిఁ జేసి వినీతుల
గతి గురువులఁ గొల్చుకరణిఁ గొల్చి

గీ॥ యురనివినయచేతఁ బరిపూర్ణుఁడై స్వతంత్ర
వృత్తిఁ జెందుచుఁ గ్రమమున వెలయు టొప్పు
నిట్టి యన్యసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 119

సీ॥ అహితులచే నొచ్చి యార్తుఁడై యాశ్రయ
హీనుఁడై తగు సంధిలేనివాఁడు
భండారమైనను బలమునైనను భూమి
యైనను భూఫలంబైన మఱియు
సకలంబునైన నిశ్చలతఁ జెందుచు నిచ్చి
యతివినయంబున నతనిఁ జేరి
తా బల్మిచెందినతఱి నైన శత్రువుఁ
డాపదఁ జెందిన యప్పుడైన

గీ॥ పేరు నెఱిఁగి విజృంభించి విమతుఁ ద్రుంచి
క్రమైనఁ గొలిపించికొనియైన నలుక పొప్పు
నట్టి శత్రుసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 150

చం॥ తనకటు వేళగానితఱిఁ దాఁ బగవారలకెంతు సర్వముం
గినియక యిచ్చి, యిచ్చలను గ్లేశము వచ్చిన నైన నోర్చి మే
లొనరువునప్పుడైనఁ దాకికొని యన్యునినైనను జేరి క్రమ్మఱన్
మనుచు ధరిత్రిఁ గైకొనుట మంచిది యెంచగ ధర్మజుండవై॥

ఆ॥వె॥ కారణంబు లేక కవిసి కూడఁగరాదు
ఘనునినైన నీచజనునినైన
కారణంబు లేక కలసిన క్షయమును
వ్యయము దోషములును వచ్చుఁగాన ॥ 152

మ॥ ఇలఁ దేఁ దొక్కొకకారణంబున నెతా నెవ్వారితోనైన నే
ర్పులఁ గూడం దగఁ గూడియుండిన యెడం బొల్పొందిచిత్తంబుతో
వల నమ్మంగొలఁగాదు తంద్రినయినం బాటించి దుష్టాత్మకుల్
దలఁప న్నమ్మినయట్టి సాధుజనులం దారెంతు హింసించుటన్॥

వ॥ ఇది షడ్గుణస్వరూపంబు. వీనిం గొందఱు మతస్థులు ద్వైధీ
భావసమాశ్రయంబులు సంధిమూలంబులె కావున సంధిగుణం
బొక్కటియును దండువెడలుటయును విడియుటయు విగ్రహ
మూలం బగుటం జేసి యానాసనంబులు విగ్రహభేదంబులే కావున
విగ్రహగుణం బొక్కటియునుం గూడ నిట్టి సంధివిగ్రహంబులు
రెండుగుణంబులే యని పలుకుచుందురు. మఱియు బృహస్పతి

మొదలయిన కొన్నిమతంబులవారు శత్రుప్రశంసచేత వాదింపం బడినవాఁ డితఁడని నాశ్రయింపుటంజేసి సమాశ్రయగుణంబుఁ బ్రత్యేకంబు గావున సంధివిగ్రహంబులు రెండును నట్టి సమాశ్రయంబునం గూడి కూఁడు గుణంబులే యని పలుకుచుండుదురు. మఱియుఁ గొన్నిమతంబులవారు సంధ్యాదిగుణపంచకంబును విగ్రహమూలంబె కావున విగ్రహగుణం బొక్కటియె న్యాయం బని పల్కుచుండుదురైనను వీని కన్నిటికిఁ బ్రత్యేకంబైన యవస్థాభేదంబులు గలుగుటం జేసి యీ కామందకమతంబునకు షాడ్గుణ్యంబె సమ్మతంబు ॥ 154

కం॥ ఈరీతిషడ్గుణంబుల
నేరుపుతోఁ జెలియునట్టి నృపవరుఁ డెలమిన్
వైరులను గెలిచి పారా
వారావృతమైనధరణివలయం బేలున్ ॥ 155

చం॥ పరమవిహార సారయుతసద్గుణ సింహగభీర నీతి సు
స్థిరరుచికీర్తిహార సుదతీజనమన్మథ సూర్యవంశభా
స్వరతర సేవితార్యజనసైన్యవిరాజిత సోమవారిభృ
చ్ఛరవిధిదాన సౌమ్యహిత సంతతశోభన సర్వసన్నుతా ॥ 156

కం॥ మండలశోధన సాధన
పాండిత్యా షడ్గుణప్రభావజ్ఞ ధరా
మండల పాలనఖేలన
దండితమత్తారిభూప దానకలాపా ॥ 157

భుజంగప్రయాతము.

ధరాధార దోర్దండ దానప్రచండా
పరాభేద్యమంత్రప్రభావ స్వతంత్రా

స్ఫురద్గాంగ భంగాహిభూషాంగవాజీ
తురంగాద్య శీతాద్రిపుత్రీ స్వకీర్తి॥ 158

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాలవరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజగోత్ర చిక్కరాజమల్లనామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీరామకృష్ణభక్త వైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందకనీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మంత్రి లోకసత్ప్రకారంబును షడ్గుణప్రచారంబు నన్నది చతుర్థాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీవినుతాలోక జగ
త్పావన రఘురామ పాదపంకజయుగళీ
సేవాధురీణ శాంత
ప్రావృత కొండ్రాజువెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### మంత్రవికల్ప ప్రకరణము

గీ॥ నృపతి షడ్గుణతత్త్వంబు నిశ్చయించి
గూఢ మగుచర్యఁ దగ మంత్రకుశలుఁ డగుచు
మంత్రివర్యులతోఁ గూడి మంత్రరీతు
లమర నూహింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 3

కం॥ తన కాప్తుండై తగుప్రా
జ్ఞునితో మంత్రం బొనర్పఁ జొప్పడుఁ బతికిన్
దన కాప్తుండౌ మూర్ఖునిఁ
దన కాప్తుఁడుగాని ప్రాజ్ఞుఁ దా విడువఁదగున్ ॥ 4

కం॥ ధర యెల్ల ననుభవించును
నరనాథుఁడు మంత్ర మెఱిఁగినం గాకున్నన్
బరిభవ మొందు స్వతంత్రతఁ
బరగియు మంత్రంబు నెఱుఁగుప్రాజ్ఞులచేతన్ ॥ 5

క౦॥ పగతులచే దుర్మంత్రం
బగపడొర చెడు దుష్టమంత్ర మగుయజ్ఞము దై
న్యగణముచే బలెఁ గావున
జగతిన్ సన్మంత్రమునఁ బొసంగఁగవలయున్ ॥ 6

ఉ॥ అనిశము ధర్మమార్గములయందె చరించినవారు సిద్ధమై
యొనరినయట్టి కార్యముల నూర్జితులై తగువారు పెద్దలై
చనరినవారు నై నగుణధన్యులు చెందినశాస్త్రమార్గ మెం
దను వదలంగ రాదు నయధుర్యులకున్ నిజకార్యసిద్ధికిన్ ॥ 7

క౦॥ జనపతి శాస్త్రముతో నెడ
సినచర్యల వేగిరమునఁ జెంది మెలఁగినన్
దనశత్రునిచే ఖడ్గం
బునకున్ గ్రాసంబు గాకపోవం గలఁడే ॥ 8

క౦॥ బలిమిఁ ద్రిశక్తులలోపల
నల మంత్రము మంత్రశక్తి ననుపొందక కే
వలము ప్రభావోత్సాహ
మ్ములఁ గల్గియు శుక్రుఁ డోడె మును గురువునకున్ ॥ 9

ఉ॥ నీతి యొకింతయుం దెలియనేరని సింగము బల్మిచేతఁ దా
నేతటియందు నేనుఁగుల నెల్ల వధింపుచు నుండు బుద్ధియున్
నీతియుఁ గల్గినట్టిపతి నేర్పున సింగపుగుంపులం గరి
వ్రాతము నుక్కునం గెలిచి వర్ధిలకున్నె ధరాతలంబునన్ ॥ 10

గీ॥ మునుపు సామాద్యుపాయముల్ మొనపవలయు
కాల మెఱుఁగుచు వైరిపైఁ గదియవలయుఁ
గాక మఱి కేవలంబు విక్రమముఁ బూని
మెలఁగువాఁ డెందు వగఁ జెంది కలఁగకున్నె ॥ 11

చ॥ పర మొదలించి ఘావిషుఁడు శక్య మశక్యముగా దలఁచి గర్వం
జెలఁగెడిబుద్ధిచే నెఱిఁగి చేసిన మే లని నట్లు గానిచో
నలవునఁ గొంత డీకొనినయుష్మదదంతిక యంతఘంగమా
పొలుపున హాస్యరీతులను బొందెద యెంము ఘభంబుఁ జెందునే ॥

కం॥ కొంతరి యశక్యపుఁ బనికై
బతలినచోఁ గీడు కాక ఫలమొందునె యె
య్యెడ విన్ను నవిఁ గొనంగాఁ
గడఁగెడి పెనువెఱ్ఱికంటె రడిఁ గొనఁగలదే ॥ 13

ఆ॥వె॥ మిడుత యగ్నిలోనఁ బడునటు నాశంబు
వచ్చునటులఁ బూని పలుక డెపుడు
తగినపనుల పూనఁడగు నగ్నిలోఁబడు
మిడుత కేమి కలదు చెడుటకంటె ॥ 14

కం॥ ఇలలో దుర్లభమగునది
బలియుఁడు మోహమునఁ జెంది పడిరిని సందుఁ
గలిగినయాపద లతనిం
గలకాలముఁ దాప మొందఁగాఁ జేయుఁ దుదిన్ ॥ 15

కం॥ అనుపమమతిచే సిరులను
జనపతి దాఁ నాక్రమింపఁ జను నెట్లన మె
ట్లనువుగ మెట్టెడునాతఁడు
ఘనమగుగిరి శిఖర మెక్కకై పడి మెఱయున్ ॥ 16

ఉ॥ అందగ దుర్లభంబగుచు నందఱు ద్రొక్కుచు ద్రొక్కనిక్కి పెం
పొందినయట్టిరాచఱిక మొక్కఁడ నించుక దుష్టవర్తనం
జెందినయేని నాశనముఁ జెందదె యెం దపచార మింత దాఁ
జెందినబ్రాహ్మణత్వము గ్రహింపుచు నిందల నొందుకై పడిన్ ॥

కం॥ విపులమతు లెంచి కార్య
క్రమమును నొనరించునట్టికార్యంబులు వే
గమె పండిఫలము లిడుఁ దా
నపరంగాఁ బ్రోదిఁగనినయల్పవన మనఁగన్ ॥ 18

కం॥ అనువుగ నొనరించినపను
లనిశము ఫలియింపుచుండు నది గాకున్నన్
మనమునకుఁ దాప మొసఁగవు
మును దెలియక సేయుకార్యములువలెఁ బతికిన్ ॥ 19

గీ॥ నేర్పు మీఱంగ లెస్స యొనర్పఁబూని
కార్య మొకరీతి సఫలంబు గానివేళ
వాఁడు నిందకుం దగినట్టివాఁడు గాడు
తానె దైవంబు కడుఁదోడుగానికతన ॥ 20

కం॥ ఫలములకై నిర్మలమతి
గలవాఁ డుద్యోగశాలి గావలె నెందున్
ఫలవిఘ్న మడరకుండన్
బలపద్దైవంబు నెఱిఁగి ప్రార్థింపఁదగున్ ॥ 21

కం॥ తనబలిమి నెదిరిబలిమిం
గనుగొని యరిమీఁద గదలఁగాఁదగు నెపుడుం
జను నేఱుఁగుపెద్ది యదివో
జనపతులకు నెఱుక నీతిచాతుర్యంబుల్ ॥ 22

కం॥ ఆర్యులు విడుదురు నిష్ఫల
కార్యము నిశ్చితఫలంబు గలుగక యెడలా
కార్యము బహువైరముఁ గల
కార్యము కడుగ్లేశమడపుకార్యముఁ బుధమిన్ ॥ 23

కం॥ తగుకార్యములె విహితముసఁ
దగిలినయవి యెపుడు మీఁదఁ దా మంచివియై
తగు నవి తొలుతన్ సజ్జను
లగువారి క్రమాగతంబు లై నవి పతికిన్ ॥ 24

గీ॥ ఎట్టికార్యంబు దనకును హిత వొనర్చు
నెట్టికార్యంబుచే నింద లెసయకుండు
నట్టికార్యంబె పూని చేయంగవలయు
నప్పు డించుకకఠినమై యడరెనేని ॥ 25

కం॥ సులభమునఁ గార్యసిద్ధులు
గలుగుటకై బుద్ధిచేతఁ గార్యము బూనన్
వలయుఁ బతి మంచిమిత్రులఁ
గలిగినచో సింహవృత్తి కడు మేలౌకటన్ ॥ 26

చం॥ తొడిఁబడ మించి పైకుఱికి దుష్టవిరోధుల పంచి సంపదన్
వడయుట లెంచ దుష్కర ముపాయబలమ్మున నదియైనఁదా
ప్పడి తగుమావటీఁడు బలభద్రగజంబుశిరంబుమీఁదటన్
దొడరియు వాయుమార్గములతోడఁ బదం బిడు లెంపుఁ జూడుమీ ॥

ఆ॥వె॥ చతురమతి కుపాయసరణిచే సాధ్యంబు
గానివస్తు వించుకయును గలదె
యినుపముద్ద యైన నిలలోన నీరుగా
కఱఁపఁ బడును చెఱిపి విఱుపఁబడును ॥ 28

కం॥ జల మింగలంబు నార్పుట
యిలమీఁదటఁ గడుఁబ్రసిద్ధి యీయింగలమే
బలువగు సహాయశక్తిని
జలచలచలఁ దెరలఁజేసి జల మిగిరించున్ ॥ 29

వ॥ మఱియు మంత్రంబునకు జ్ఞానంబును, రక్షణంబునుఁ, బ్రకాశంబునుఁ బ్రశస్తియు సంగంబులును వ్యాపారంబు నుత్పత్తిక్రమంబునుఁ బరిశుద్ధియు ఫలసిద్ధియు నావర్తనంబును, ధారణంబును, మొదలయిన యవస్థాభేదంబులు గల మందు విధుండు సాక్షాత్కారంబునం దెలియునియర్థంబు దెల్లం జెప్పుట యనెడి యవిజ్ఞాతవిజ్ఞానంబును దెలిసినయర్థంబు కష్యపూర్వకంబుగా నిర్ణయంబుఁగావించుటయనెడి విజ్ఞాతనిశ్చయంబును నందు రెండు కార్యంబులు ప్రసక్తంబులైన నొకటి గావించుట యనెడి సందేహ ఛేదనంబును, వెండియు సంధివిగ్రహంబులలోన స్మృతి నమ్మతంబున సంధియ మంచిదగుటఁ దెలిసి యదియును ధే పూర్వకంబైన దెస్సయని తెలిసికొనుట యనెడి శేషదర్శనంబును నను నిట్టి చతుర్విధ భేదంబులుగల జ్ఞానంబు మంత్రులవలనన సంభవించుంగావున. 30

సీ॥ మంత్రులుఁ దాసును మతులందు దెస్సగాఁ
బరిశుద్ధిసేయు టుత్పత్తియండ్రు
తనదు నుత్పత్తిచేఁ దనమంత్ర మది దెస్స
తెలిసి రక్షించుట స్థితియటండ్రు
చాల దానినిఁ బ్రకాశంబుగాఁ జేయుటే
మఱి లయ మని యండ్రు మంత్రమునకు
నిన్నియు నెఱుఁగుచు నిది దేశ మిది కాల
మిది యాయ మిది వ్రయం బిది బలంబు

గీ॥ దీని కిది యుక్త మంచును దెలివితోడ
మంత్రవిదులను గూడి నెమ్మదిఁ జెలంగి
శాస్త్రమార్గంబు వదలక చతురుఁ డగుచు
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు ॥ 31

కం॥ జనపతి కునుమంత్రులయా
జ్ఞను మెలఁగుచు నుండి యెట్టిజనులను దాఁ గా
వనిక పనికి యన్నిపయిపనుల
వినవలయును మంచిమాట వెదకెడివాఁడై ॥ 32

కం॥ జనపది మదించి పనియొడఁ
జనమంత్రుల మీఱుపతి పృథామంత్రుఁడు పే
దని యెంచ నొందు నతనిని
గనుఁగొని రిపు లాక్రమింపఁ గడఁగెదు రెపుడున్ ॥ 33

కం॥ మంత్రము రక్షింపఁగవలె
మంత్రము మూలంబు మిగుల మనుజేంద్రులకున్
మంత్రము వెడఁ దాఁ జెడుఁ ద
న్మంత్రము రక్షింప రక్షణముఁ గనుఁ దానున్ ॥ 34

కం॥ చతురుఁడయి కాల మెఱుఁగుచు
నతులితగతి సింహవృత్తి నడరెడుధరణీ
పతి కార్యము సేయుతఱిన్
హితులును నది యైన నహితు లెఱుఁగఁగవలయున్ ॥ 35

కం॥ ఫల మెవ్వేళ నొసంగన్
గలుగుచుఁ గడువేగఁ గోర్కె ఘటియింపంగాఁ
గలుగుచుఁ బశ్చాత్తాపము
గలిగింపనియట్టిమంత్రిగతి మంచిదగున్ ॥ 36

మంత్రాంగములు

ఆ॥వె॥ దేశకాలగతులు దెలియుట, సాధనో
పాయచింతయును, సహాయవితతి,
నాపదలకుఁ బ్రతిక్రియయుఁ, గార్యసిద్ధియు
నైదు మంత్రమునకు నంగము లగు ॥ 37

## కార్యసిద్ధి సూచకములు

గీ॥ పౌరుషంబు సహాయసంపద మనఃప్ర
సన్నతయు దేహదార్ఢ్యంబు సమకొనుటయు
బుద్ధి విశ్వాసమును జాలఁబొడముటయును
గార్యసిద్ధికి గుఱుతులై గానిపించు ॥ 44

కం॥ సులభములగు యత్నంబులు
గలుగుట, తగుసాధనములు గలుగుట, విఘ్నం
బులు లేకుండుట, కార్యం
బులకున్ ఫలసూచకములు భువి నివి తెలియన్ ॥ 45

కం॥ పలుమఱు మదిలోఁ దలఁపఁగ
వలయున్ మంత్రము ధరింపవలయును యత్నం
బలరఁగ నటుగాని యెడం
జలియింపుచు నగ్నిలీలఁ జాల దహించున్ ॥ 46

కం॥ వెలివడు మంత్రం బాప్తుల
వలనన్ రక్షింపకున్న వసుధాపతికిన్
దెలిసి యటుగాన నాప్తుల
వలనను మంత్రంబుఁ బ్రోవవలె యత్నమునన్ ॥ 47

ఆ॥వె॥ కలువరింతపలుకువలనఁ గామమువల్ల
మదమువలన మఱి ప్రమాదములను
గదిసి గుట్టుఁదెలియుఁ గామినీవితతుల
వలన మంత్ర మదియు వసుధలోన ॥ 48

గీ॥ కంబములు లేక సోరణగండ్లు లేక
పడుమ గోడలు లేక పెంపడరుచోట
మేడపైఁ గానలో నైన మెలఁకువ వలర
మంత్ర మాలోచనము సేయు మనుజవిభుఁడు ॥ 49

## మంత్రిమంతల వృత్తము

సీ॥ రాజునొక్క మంత్రిమండలముతో మంత్ర మా
హింపఁగాఁ బోలు నభివృద్ధికొఱకు
పది యెన్మి దన్న దేవాచార్యమతము వా
రఖిలసమ్మతిఁ బదియాఱ్వు రంచు
మనువు పన్నిద్ద రైనను జాలు నని పల్కె
మఱియు శుక్రాచార్య మతమువార
లిరువదియునొకసంఖ్య నెంతు రీమంత్రుల
నితర మతంబులా రెటులనైనఁ

గీ॥ గదిగినందఱె చాలు మంత్రు లని యందు
రిటుల మంత్రులసంఖ్యఁ దా నెఱుఁగ నేర్చి
వారిఁ వెలియంగఁ జేసి వేఱు వేఱ సారె
శాస్త్రమార్గంబు వదలక జనవిభుండు ॥ 50

చం॥ హితుఁడయి మంచిపక్షమున నెన్నిక కెక్కినపు నీతిశాస్త్రసం
గతముగఁ గార్యచర్యలఁ దగం జరియించినవాఁడు నాత్మస
మ్మతుఁ డగువాఁడునైన తనమంత్రిశిఖామణి పల్కినట్టి యా
మతమె యొనర్పఁగా నగును మానవనాథున కెట్టివేళలన్ ॥ 51

కం॥ మును మంత్రనిశ్చయంబున
నెనసి నృపుల్ కార్యకాల మెఱిఁగి మెలంగన్
జనుఁ గాలము మీఱినచో
ననువుగఁ గల్పింపవలయు నది మసుడంగన్ ॥ 52

కం॥ అదను మదిఁ గోరుచుం దగు
నద నొక్కొకవేళ దొరకునపుడు దనపనుల్
గొదవయిడికొనినఁ గ్రమ్మఱ
నద వచ్చుట దుర్లభం బటంచ్రు నయజ్ఞుల్ ॥ 53

కం॥ మతిమంతుఁడు సన్మార్గము
గతిచే సమ నెఱిఁగి సేయఁగాఁ దగుఁ గార్యం
బతినియతి నెటులనైనన్
క్షితిలోపల మంచిఫలమె చేకొనుచుండున్ ॥ 54

మ॥ ఇది యీరీతిది దీని కిట్లనుచుఁ దా నెంతే విశుదాత్ముఁడై
యదనన్ దేశమునందు భూపతి సహాయశ్రేణితోఁ గూడి స
మ్మద మొప్పన్ బరిశుద్ధపాన్యుఁడగుచున్ మ త్తారివీరావళిం
జెదరంగాఁ దగుఁ గాక చాపలగుణేచ్ఛన్ వర్తిలం జెల్లునే ॥ 55

చం॥ అహితము లైనఁ గార్యములయందు హితంబను బుద్ధి నేర్చి యా
సహితయి మూఢుఁడౌనతఁడు మంత్రులమాటఁ దిరస్కరించి తా
నహితులమీఁదటం జనుచుఁ గై కడు వేగమె వోయి వారునన్
మహితకరాసువెత్తి పరిమాయినచోఁ జెలియు న్మనంబునన్ ॥

చం॥ ఎదిటిబలాబలంబు లొకయింత యెఱుంగక మంచిసాహసం
బొదవ మదించి మించి బలియుండను నేనె యటంచుఁ గొంచమౌ
మదిఁ దమకించుభూపతి సమంచితచంచలవృత్తి శత్రుపైఁ
గదలి మరంబులోనఁ బడుఁగాక సుఖస్థితి నుండ నేర్చునే ॥ 57

మ॥ అమితోద్యోగముఁ గల్గివట్టిరిపురాజానీకముం గ్రూర స
ర్పములం బోలె నయప్రవర్తనలచే భాసిల్లుభూపాలకుం
డమర స్మంత్రబలంబుచేఁ దనసు లోనై యుండఁగాఁ జేయు ట
ద్భామగున్ ధారుణి నల్లొనర్చిన స్వపాలాగ్రేసరుండై తగున్ ॥

వ॥ ఇది మంత్రస్వరూపం బింక మాతచారులప్రకారం బెట్లన్నను. 59

చం॥ అనువుగ మంత్రముం దెలిసి యంతటి యర్థము లాచరించురా
జనిశము దూతకృత్యములయం దభిమానముఁ గల్గి మంత్రులో
జనులకు నెల్ల మంత్రమును [illegible]లడై తగుదూతఁ బంపఁగాఁ
జను సమయం[illegible]మంత్రమర్మవిభేదకారిదై ॥ 60

కం॥ తలఁచుకొనుశక్తి ప్రౌఢిమ
పలుకులనేర్పులును శాస్త్రపరిచితిఁ గార్య
ములయవధానము నాయుధ
ములతెలివియుఁ గలుగువాఁడు భువి దూత యగున్ ॥ 61

దూతభేదములు

సీ॥ కార్య మెంతయు హత్తఁగాఁ జేయఁజాలిన
యతఁడు నిసృష్టార్థుఁ డనఁగఁ బరఁగుఁ
జెప్పినట్లే పోయి చేయఁగా నేర్చిన
యతఁ డరయ మితార్థుఁ డనఁగఁ బరఁగు
నేమియు నెఱుఁగక యేలినాతనికమ్మ
లందింప శాసనహారకుండు
జగతిలో నీరీతిఁ దగి మూఁడు దెఱఁగులై
చరియింతు రీదూతజనులు వసుధఁ

ఆ॥వె॥ పరజనంబు లిట్టులఁ బలికినఁ దా నిట్లు
పలుకవలయు ననుచుఁ దలఁచికొనుచుఁ
బోవఁదగినయెడకుఁ బోవఁగా వలయును
క్షితిపవరుననుజ్ఞచేత దూత ॥ 62

కం॥ అలజడివారల నాటవి
కులఁ దనకున్ లోనుజేసికొనఁదగు మఱియున్
జలములపెక్కులు త్రోవలు
దెలియఁగఁదగు దనదు సేనఁ జెప్పుట కొఱకై ॥ 63

కం॥ అరిపురము నతనిసభయుం
జొరవలయుఁ బ్రకారరీతిఁ జొప్పడ నరిచేఁ
బరికింప ననుమతుండై
యిరవుకొనం జనఁగ నొప్పు నిల దూతలకున్ ॥ 64

నొకయించుక వ్యసనంబుఁ గలిగియున్నకతనను, నొంటిలో నొకయించుక వ్యాజ్యంబుగలుగు కతనను దమబంధువులతోనఁ గలహంబుఁ బుట్టిన నీతిపరుండు గాపున నివియు వారింపు కతనను ఫలకాలంబు గాన ధాన్యాదిసంగ్రహంబు సేయుచుండు కతనను దుర్గంబునకు నవరణలు సేయించుకతనను దన సైన్యంబులకు క్షేమంబుఁ గోరువాఁడై వర్షాదికాలదేశవిష యంబులవలనఁ దా రాకయున్నకతనను దాన ధనాదికంబు వర్తించుకొని వచ్చువాఁడై యున్నకతనను, వెలిబండారంబులు వేసి పయనంబునకు సామగ్రి యొనఁగూర్చుకొనుచుండుకతనను, నాలస్యం బయ్యెనని యుచితరీతులఁ గాలంబు గడుపుచు నుండి. శత్రువునకుఁ గార్యకాలంబులోనఁ గూడకయుండుట తెల్పఁ దెలిసి మగుడివచ్చియైనను రాకయుండి యైనను శత్రువార్తలన్నియు తెల్పగాఁ దనయేలికకు నెఱింగించవలయు నుఱియును. 76

సీ॥ పగఱసామర్థ్యంబు బలమును దుర్గంబు
భండారమును మిత్రబంధుతతుల
నతఁడు పూనుచునుండు నట్టికార్యంబుల
తెఱఁగులు తెల్పగాఁ దెలియుటయును
గడలఁగావలివారి నడపులకడవారిఁ
దనవారిగాఁ జేసికొనుట మఱియుఁ
దమ కనిసేయఁగాఁ దనుచోట మగుడి పో
వనువైనచోటుల నరయుటయును

గీ॥ చూత యొనరించునను లంద్రు దూతజనుని
వలన నెఱుఁగంగ వలయును వైరిచర్యఁ
దనజనమ్ములయందును ధరణీనాథుఁ
డరివరులదూతచేష్టల నరయ వలయు ॥ 77

## దూతచారవికల్ప ప్రకరణము — దూతలక్షణము

ఉ॥ తలఁపున మించి క్లేశములు దాళి ప్రయాసము నోర్చి దక్షుఁడై
చెలఁగుచుఁ బోవ రాఁ గలిగి శీలముఁ జెంది పరేంగితంబు సూ
హలు దనలో నెఱింగి కఠినాత్ముఁడు గాక యుక్తి పెంపునన్
గలిగినవాఁడు దూత యనఁగా నుతికెక్కుచునుండు నెప్పటన్॥

వ॥ ఇది దూతలక్షణం బగు నింకఁ జారలక్షణంబు వివరించెద. 79

## చారలక్షణము

కం॥ ముసుగును జాపలు చిప్పలు
నసఁ బగి దిశలందు ధూర్తులై తిరుగంగాఁ
గసు వేగువారు వార్తల
ననువుగఁ దెలియుచును బతికి నవి తెల్పుటకై॥ 80

ఉ॥ ఇలఁ గల దూరకార్యముల నెల్లఁ గనుంగొనఁ జాలునట్టి చ
క్షులు పతి కెందు నెంచఁగ వినూతనచాతురిఁ బొల్చువేగువా
రలె కద కాన వారలు ధరాతలమందుఁ జరించుచు సర్వవా
ర్తలు దెలుపం జనుఁ బతిహితంబుగ వచ్చుచుఁ బోవుచుండఁగన్॥

ఉ॥ చెలఁగెడు సూక్ష్మసూత్రములచేత బలెం దనవేగువారిచే
నిలఁ గల సర్వవార్తలు మహీపతి దా నెఱుఁగంగ నొప్పు ఎ
ట్లలపునఁ జారచక్షుఁడయి యందము నొందినరాజు నిద్రచే
నలరినవేళ మేల్కొనినయట్టివిధంబున మించు నెంచఁగన్॥ 82

గీ॥ కదలుటలచేత వ్యాపించు గాలిలీలఁ
గిరణములచేత వ్యాపించు తరణికరణి
నరపతికి లోకసమ్మతులైన వేగు
వారిచేతనె వ్యాపించవలయు జగము॥ 83

బహువేషధారులై పరగెడివారలు
మంత్రముల్ మంత్రించు మంత్రవిదుల
సత్త్రకోర్లకు దున్నికొనియెడివారలు
కోపటులై యమ్మికొనెడివారు

గీ॥ పసచు వైరులపురములయందు నిలిచి
విభునిచేతను ధన మొంది పేసవారు
చాలసుఖలీలచేఁ జమచరుల కెల్ల
నొరిమ నాధారరీతుల నుండవలయు ॥ 87

సీ॥ ఇటుల శత్రుపురంబులం దెపుడు నిలిచి
యుండు సంస్థులయొద్దకు నొక్కచరుఁడు
పరులదేశంబునందుఁ గొందఱను దఱుచు
పలయు విభునకు నవ్వార్తఁ దెలుపుటకును ॥ 88

వ॥ ఇట్లు దేశవార్త లరయం దిరిగెడివారు, పంచాపలు, తీర్థులు, ప్రవ్రజితులు శస్త్రిలు, రసదులు, ననం బరఁగుచుండుదురు. తత్ప్రకారం బెట్లన్నను 89

సంచారగూఢచారలక్షణము

సీ॥ అష్టఁబెట్టుచు నూళ్ళయందు గ్రాసముఁ జెంది
తీర్థులు యోగులై తిరుగుచుండ్రు
ప్రవ్రజితులపేరఁ బరగెడిచరులు స
న్యాసివేషముల నంది యుండ్రు
శస్త్రవైద్యముఁ జేసి చరియింపుచుదు కొంద
ఱఖిలభూముల శస్త్రి లనెడివారు
రసవైద్యములు చేసి రసికులై తగు చుండ్రు
రసదులపేరింటఁ బొసఁగు వార

వ॥ మఱియు నందులలోనిభేదంబు లెనయం దగి శత్రురాజుల యంతఃపురవార్తలెఱుంగఁజేయు వేగులవారివిధం బెట్లన్నను.

సీ॥ కానసివారలకై పడి విసకుండు
వానిరీతుల మూఁగవానికరణి
మెలఁగువారు నపుంసకులు జడవేషులు
గూనుబోయినవారు గుఱుచవార
లటువంటిరీతుల యాకారములు గల్గు
కాయలు వంగ్లమ్ముబోయవారు
చాకలవారు బిచ్చాలవారలు నట్టు
వలు మఱి శిల్పముల్ గలుగువార

గీ॥ లింటి బిడ్డలు బూపంచ లిచ్చువారు
విమతరాజులయంతఃపురములలోని
వార్త లెల్లను దెలియంగ వలయు నెపుడు
వేగువారలు గుఱిఁగానివిధముతోడ ॥ 95

గీ॥ గొడుగులును గిండ్లు సురటులు గుత్తములును
బట్టువారలు పల్లకీ ల్మోట్టువారు
నగుచు వేగులవారలు పొగడవార్త
వెలినిఁ గలవార్తఁ దెలుపఁగా వలయుఁ బతికి ॥ 96

సీ॥ వంటలవారలు వైద్యులు తపసులు
జ్యోతిషికుల్ వ్రతుల్ హాస్యపరులు
నాంధ్రవారలు నీళ్ల నందించువారలు
జెట్టులు భుజియింపఁ బెట్టువారు

పేడెపుల్ సొమ్ములు విరు లోసంగెడివారు
కలపముల్ గూరిచి యలఁదువారు
సింగారములు సేయు సంగడికాండ్రును
నామతీర్థమువారు సామువారు

గీ॥ నాడియగువారి శత్రులయంద నిలిపి
యింగితాదుల నితరు లెఱుంగనీక
వారు కెందును రసమిడఁ జేయవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ పటుపట నింగితాకృతుల భాషల నన్య లెఱుంగకుండ నే
ర్పున మును బందుకట్టినలిపుల్గల కమ్మలచేత శత్రుప
ర్తనముల నొండొరుల్ గడుఁ దిరంబగురీతి నెఱింగి వేగువా
రనువుగఁ దెల్పఁగాఁ దగు ధరాధిపవర్యున కాప్తులై తగన్ ॥

చం॥ రవికిరణంబు వెల్లెడల రాజిలి నీరముఁ బీల్చునై వడిన్
భువిఁ గల వార్త లెల్లఁ దమబుద్ధిబలంబున సంగ్రహింపుచున్
వివరముతో రహస్యగతి వేగులవారు చరింపఁగాఁ దగున్
వివిధములైన వేషములు విద్యలు శిల్పములుం దొసంగఁగన్ ॥

కం॥ ఏరీతి పెరులకొఱకై
వైరులఁ దా నాక్రమించు వారు నటులనే
చేరి యొనర్చు నుపాయ ము
దారగతిం దెలియ వలయు ధరణీపతికిన్ ॥ 100

శా॥ లక్ష్మీసంయుతనీతివిక్రమకళాలంకార లంకారణా
పూక్ష్మప్రాభవ రామభద్రసుగుణస్తోత్రోల్లసన్మంత్ర మం
త్ర క్ష్మారక్షణదక్ష దక్షవిమతప్రఖ్యాతశౌర్యక్రియా
లక్ష్మప్రస్తుతచార చారవరజాలజ్ఞాతవార్తోజ్వలా ః ॥ 101

కం॥ శ్రీ కర్ణాటాధిపద
త్తాకలితసవీనచామరాదికనృపచి
హ్నాకల్పవరశుభాంకా!
శ్రీకరమహనీయరూపజితమకరాంకా! ॥ 102

తరలము॥ వినయమహార! నవయచార విదిత ధీరమండలీ
వినుతిహార కీర్తిపూర వివిత తారకా కర
ఘనదవార! మథిత ఘోరవైరి వీరశౌర్య ఘో
లస గభీర గుణవిహార లలితశూర సేవితా ॥ 103

గద్యము॥ ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భార
ద్వాజసగోత్ర జక్కరాజు ఎఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన విధేయ
శ్రీరామకృష్ణ భక్తిపైభవ భాగధేయ వెంకటనామధేయ ప్రణీతం
బైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మంత్ర
ప్రభావంబును, దూతచారస్వభావంబు నున్నది పంచమాశ్వాసము.

# ఆంధ్ర కామందకము

## షష్ఠాశ్వాసము

కం॥ శ్రీదశరథ నృపనందన
పాదాబ్జస్మరణకరణపటుమానసః స
మ్మోదితసజ్జనవిదితన
యాదిక కొండ్రాజువెంకటాద్రినరేంద్రా॥ 1

వ॥ అవధరింపుము. 2

### ఉత్సాహప్రశంసా ప్రకరణము

ఉ॥ శ్రీరమణీయుఁడై నృపతిశేఖరుఁ డన్నిట బుద్ధిమంతుఁడై
చారులచర్యచే నెపుడు శత్రులబల్మి యెఱింగి యెంతయుం
గౌరవ మెంచ దూతలముఖంబునఁ గార్యము గానిపింపఁగన్
వైరుల ఖేదపెట్టుచు నవారితలీలల దండు పోఁ దగున్॥ 3

కం॥ సమకొను ప్రయత్నమును స
త్త్వము చెందుచు సూక్ష్మధారఁ దగి నిల్కడయై
యమరినమతి ఫలసిద్ధిం
గ్రమమునఁ గను నరణి యగ్నిఁ గనుచందమునన్॥ 4

ఉ॥ జేగురుటాలఁ గుందనముఁ జెందినమాడ్కి దధిన్మథించినన్
వేగమె వెన్నపుట్టునరణిన్ వరబుద్ధిసమేతయత్నసం
యోగముగల్గి నిల్కడల నొందుచు నుండెడు నట్టి మంచి యు
ద్యోగముచేత నెల్లపుడు నొందు ఫలంబులు నిశ్చయంబుగన్॥

కం॥ అల యుత్సాహము బుద్ధియుఁ
జెలఁగగ నుద్యోగియైనక్షితిపతి యిలలో
బల సిరులకు నిలుకడ యగు
జలములకును బెంకియైన జలనిధివోలెన్ ॥ 6

కం॥ జలములచేఁ బాలితమగు
జలధినిగతి బుద్ధిచేత సంపదఁ బ్రోవన్
బలయును యుత్సోత్సాహ
మ్ములచే నది యెపుడు ప్రబలముగాఁ జేయఁదగున్ ॥ 7

మ॥ ఇల నుత్సాహగుణంబునం బొదలి తా నెవ్వేళలన్ బుద్ధిచే
మెలఁగం జాలినయట్టి రాజుపలన న్మేలౌ సిరుల్వాసి పో
కలుచు న్మేసులతోడ నీడ తెడబాయం జాలకున్నట్టిలీ
లల విస్తారముఁ జెందుచుండు నవి చాల న్నిక్కి పెంపెక్కుచున్ ॥

కం॥ అలయక వ్యసనములకుఁ గడుఁ
దలఁగుచు నుత్సాహమతులఁ దనరెడువిభునిన్
బలుసిరులు తామె చెందున్
జలనిధిలో నదులు చెందుచందం బందన్ ॥ 9

కం॥ జనపతి మతిఁగలిగియు దా
ననిశము వ్యసనములచేత నలసుండైనన్
ఘనసిరులు దన్ను విడుచును
వనితలు చేవంబులేనివానిం బోలెన్ ॥ 10

మ॥ ఘనమౌ కట్టియచేత నగ్ని బలియంగాఁ జేయుచందంబునన్
దనయుత్సాహముచేత సత్త్వమభివృద్ధంబై కనం జేయఁగాఁ
జను నిద్ధారుణి నట్లకా విలసితోత్సాహంబు నిత్యంబు జెం
దిన యాదుర్నృలుఁడున్ సిరిం గని సముద్దీపించుఁ జంచద్గతిన్ ॥

మ॥ తలఁపక సంపద నెల్ల ధూర్తయగు కాంతంబోలె భూజాని ని
చ్చలుఁదాఁ బౌరుషయుక్తుఁడై యనుభవించంగోరియత్నంబు భూ
స్థలిఁ జెందం దగు నిట్లుగాక మఱి యుత్సాహంబుతోఁ బాయుచున్
వలదెవ్వేళ నపుంసకుండబలె నుంచంగా మహీభర్తలన్ ॥ 12

కం॥ అందంద ధూర్తయై తగు
మందగమనఁ గూడునట్లు మఱి సిరి దగుఁ బో
యెందు నల సింహవృత్తిన్
ముందల వట్టీడ్చి తెచ్చి ముదమును జెందున్ ॥ 13

చం॥ ధళధళమంచు మించులను దాల్చుచు సారకిరీటరత్నసం
క్తులఁ దులలేనిచిత్రములతోఁ దగువైరిశిరంబులందు ని
చ్చలుఁ జలమెచ్చఁ బాద మవిషాదముగా నిడఁడేని కే
వలవలమానమానసుఁ డవశ్యము దా శుభ మంద నేర్చునే ॥ 14

కం॥ పసగల యుద్యోగముచే
వెసగొలిపెడు చిత్తమనెడిమేసుఁగుచే ని
వ్వసుమతిఁ బరులను దరువుల
వెస గడపక నృపతి కెంచ విభవము గలదే ॥ 15

చం॥ చెనకినవైరిపైఁ జికిలిచేసిన ఖాసిలుపెద్దకత్తి దూ
సిన జనియించు ఛాయలు విచిత్రములై మదహస్తిహస్త ఖే
లనకరదండయుగ్మమున లావునఁ బట్టినఁ జిక్కుఁగాక మిం
చిన ఘనరాజ్యలక్ష్మి దనచేతికి నూఱక చిక్కదక్కునే ॥ 16

ఉ॥ ఉన్నతమై చెలంగు పద మొందఁ దలంచినయట్టివాఁడు దా
సున్నతమై చెలంగు పద మొందుచునుండును, గాక నీచమై
యున్నపదంబుఁ గోరుకొనుచుండెడినీచుఁడు చెందు నీచమై
యున్నపదంబుఁ దాఁ బడుట నొందెడు శంకదొలంక నెల్లచోన్ ॥

ఉ॥ తనకంటెన్ బొడవైనయేనుఁగులమీఁదన్ విక్రమంబొప్పఁ జెం
గన సింగంబు పదంబుఁ బెట్టుగతి రాజాగ్రేసరుండెల్లచోఁ
టన యుత్సాహముచేత విక్రమముచేత న్మించ నత్యున్నతిన్
ఘనమైనట్టిపదంబుఁ గైకొను ధరాకాంతుల్ నుతుల్ సేయఁగన్॥

కం॥ భయమెఱిఁగిన పా మొరులకు
భయముగఁ దనపడగఁ జూపు దాపనఁ బతియున్
భయమునఁ బొరయనివాఁడై
నయగతిఁ దేజంబుఁ జూప నాయం బెందున్॥ 19

వ॥ ఇది యుత్సాహ ప్రకరణం బింక స్వామ్యాది సప్తాంగంబులకుఁ
గల ప్రయోజనంబులును, వ్యసనంబులును గ్రహింపున 20
వివరించెద నంటి రాజప్రయోజన మెట్లనిన.

ప్రకృతికర్మ ప్రకరణము — రాజచర్య

సీ॥ విద్యలన్నియు లెస్స విని యర్థము లెఱింగి
వర్ణాశ్రమంబుల వరుసఁ బ్రోచి
శస్త్రశాస్త్రంబులచందముల్ గనుఁగొని
యనిసేయునేర్పుల నభ్యసించి
యలవుమై నెపుడు వాహ్యాళి వెళ్ళఁగ నోపి
కార్యపద్ధతుల సంగతులు దెలిసి
రథములఁ గరులఁ బోరగ నేర్చి యెంతయు
బాహుయుద్ధమురీతి పదిలపఱిచి

ఆ॥వె॥ మాయలెఱిఁగి పరుల మనసులు గనుగొని
కైదువుల పరీక్షఁ గనఁగఁ జాలి
సకలజనులు మెచ్చ జయపెట్టి మెలఁగుట
రాజచర్యలివి ధరాతలమున॥ 21

సీ॥ మంచివారికెల్ల మంచివాఁడగుటయు
ధూర్తుల యెడఁ గడు ధూర్తగుటయు
సామదానంబులదండంబు భేదంబు
వంతం బుపేక్షయుఁ దగ నెఱుఁగుట
మంత్రవిచారంబు మఱవక సేయుట
మంత్రిమార్గమున సమ్మతి మెలఁగుట
మంత్రంబు రక్షించి మంత్రస్థిరుం డౌట
దుష్టజనంబుఁ బోఁ దోలుటయును

గీ॥ మఱియు విభవాయ లధికార్లు మంత్రివరు ల
మాత్యులుఁ బురోహితాదులు నిత్యలీల
మెలఁగుగతు లన్నియును లెస్స దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 22

సీ॥ అరసి యమాత్యాదు లైనట్టి సప్తాంగ
మందలివ్యసనంబు లడఁచుటయును
గోపమందినవారి కోపంబు మాన్చుట
సరసపు చెప్పినబుద్ధిఁ దియగుటయును
బూజార్హులగువారిఁ బూజింప నేర్చుట
ధర్మాసనము వెట్టి తప్పునంట
రాజ్యబాధకులను బ్రహరించుటయు బంట్లు
జీతముల్ చెందుట చెందకుంట

గీ॥ చేస్తినవి సేయనివి పరీక్షించి యుంట
యెవుడు పేదరికల్లిబుస నెనయువారిఁ
గలిమిగలయట్టివారిని దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 23

సీ॥ మధ్యమోదాసీనమానవేశుల మార్గ
మరసి వారల సంధియందుటయును
మచ్చువారిని బోవువారి నెఱుంగుట
హితులఁ గూర్చుట వైరితతి నడఁచుట
యాంత్రి బిడ్డల వెన్న యరసి రక్షించుట
పలుదిక్కులకును దూతలఁ బనుచుట
తనకు జీవనమువై తను గనుల్ వనుచును
గనులును గృషులాది గాఁగఁ గల్గ
గీ॥ నట్టి పన్నియుఁ జేకూర్చి యలరుటయును
దుష్టులగునట్టివారలఁ ద్రోయుటయును
మంచివారలఁ జేపట్టి మించుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 24

సీ॥ సకలజంతువుల హింసలు చేయకుండుట
యొంటి సధర్మంబుఁ జెందమియును
మంచికార్యము లొనరించగాఁ బూనుట
దుష్టవాక్యములెల్లఁ ద్రోచియుంట
యియ్యంగఁ దగుచోట నియ్యంగ నేర్చుట
పుచ్చుకోఁ దగుచోటఁ బుచ్చుకొనుట
దండింపఁ దగనిచో దండింపకుండుట
దండార్హులగువారిఁ దెండుటయును
గీ॥ దెలియఁ దగినవి తెలియుట, తెలియఁదగని
యర్థములు విడుచుటయు, నిరర్థకములు
మాను టర్థంబుగలయవి పూనుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 25

సీ॥ అరిఁ గోర్ల నెపుడు న్యాయంబుగాఁ గొనుటయు
నెఱిఁగి న్యాయంబుగా నిచ్చుటయును
మనప్రధానజనంబు ఘనముగాఁ బ్రోచుట
విడువగాఁ దగువారి విడుచుటయును
వైరంబు లడఁగించి వర్తించుటయు బంట్ల
తోడి విరుద్ధంబుఁ ద్రోయుటెందు
నెఱుఁగకుండిన యర్థ మెఱుఁగఁగా నేర్చుట
యెఱిఁగి యర్థము నిశ్చయించుటయును

గీ॥ సకలకార్యంబులం దను జతురుఁ డగుచుఁ
బూని సేయుచు నుండుట, బూనినట్టి
పనులఁ గడ వెళ్ళఁగాఁ జేసి పరగుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 26

సీ॥ నీతి మించఁగఁ జెందనిది చెందఁగోరుట
చెందిన దభివృద్ధిచేసికొనుట
యభివృద్ధిచెందినయర్థంబు శాస్త్రోక్త
మగురీతి సత్పాత్రమందు నిడుట
మఱియు నధర్మముల్ మాన్పుట యనునీతి
విడువ కెవ్వేళల నడచు టెందు
నుపకారయోగ్యులై యుండెడువారికి
నుపకారములు సేయుచుండుటయును

గీ॥ ధర్మ మెప్పుడు ధనముగా దాఁచికొనుట
యెంచఁదగుఁ గీర్తి మించి వర్తించుటయును
దైవమును బ్రాపు దాపుగాఁ దలఁచికొనుట
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 27

వ॥ అమాత్యప్రయోజనము. 28

## మంత్రి చర్య

సీ॥ ఆదాయములు గల్గ హానువు( గల్పించుట
యెఱిఁగి వెచ్చంబు సేయించుటయును
పైకొని పగవారి రాకుండఁ జేయుట
క్షితిపతి నెపుడుఁ బోషించుటయును
దండనీతియును మంత్రంబు నెఱుంగుట
యెఱిఁగి మంత్రఫలంబు నెనయుటయును
వ్యసనముల్ రాకుండ వర్తింప నేర్చుట
లెస్సగాభూమిఁ గాలించుటయును

గీ॥ పొందుట ఫలంబు గలుగఁ దా మెలఁగి తెలఁగు
టాదిగాఁ గల్గియుండెడునట్టి వెల్ల
మంత్రిజనములపనులంద్రు మహిఁ దలంప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 29

వ॥ రాష్ట్ర ప్రయోజనము. 30

## రాష్ట్ర చర్య

కం॥ బలమును భండారము ధన
ములు వాహనములును ధాన్యములు దృణకాష్ఠం
బులు మొదలగువస్తుతతుల్
గలిగించుట రాష్ట్రమునకుఁ గల పను లరయఁగా ॥ 31

వ॥ దుర్గప్రయోజనము. 32

## దుర్గచర్య

సీ॥ ఆపద తఱిఁ బ్రజ కాశ్రయంబగుటయు
భండారమున కున్కిపట్టగుటయు

సకలదేశంబులయందు నుండెడివారి
లేయెడ నిలుకడ నెసయుటయును
బలులకుఁ దోఁట్లాట దాసగాకుండుట
ఘనమైనవిజయంబు గనఁగలుగుట
శత్రుల మిత్రుల సమకూర్చఁ గలుగుట
బలముల రక్షించఁ గలుగుటయును

గీ॥ నడిదొరలచేత మఱి పాలెగాండ్రచేతఁ
దీనఁ దొరయక యెంతయు బెంపుఁగనుట
మొదలుగాఁగల్గు నిట్టి దుర్గమునకు బనులు
నృపతి యీమార్గముల నెల్ల నెఱుఁగవలయు ॥ 33

వ॥ బలప్రయోజనము. 34

## బలచర్య

సీ॥ విపత్తులఁ జెండాడి విజయంబుఁ గనుటయు
మిత్రులఁజేకూర్చి మెలఁగుటయును
జగతి నెంతేనియు సాధింపఁగలుగుట
ధనముల నార్జించి తనరుటయును
దూరకార్యముల నెందును వేగచేయుట
చెందినదాని రక్షించుకొనుట
నిజబలతతుల నెన్నికమీఱఁ గూర్చుట
పరచక్రములఁ గీడుపఱచకుండు

గీ॥ టాదిగాఁగల్గుచుండెడు నట్టి వెల్ల
ప్రాజ్ఞులగువారు బలములపనులటందు
రిట్టి మార్గంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱిఁగినన్నృపవరుండు ॥ 36

వ॥ మిత్రప్రయోజనము. 36

సుహృచ్చర్య

సీ॥ పగవారలను మట్టుపడియుండఁ జేయుట
మంచిమిత్రులఁ బ్రబలించుటయును
భండారములచేత బలములచేతను
క్షితిచేతఁ బ్రాణంబుచేతనైన
నిల నుపకారములే చాలఁ జేయుట
మిసపలనెయ్యంబుతో మించుటయును
గణుతింపఁ బ్రత్యుపకారంబుఁ గోరక
మంచికార్యములు సాధించుకొనుట
గీ॥ యాపదలయందు మిగుల సహాయుఁడగుట
సంపదలు చెందియుండిన సంతసిలుట
యరయ మిత్రుని పనులంద్రు ధరణినాథుఁ
డిట్టి రాజ్యాంగముల పనులెఱుఁగవలయు ॥ 37

వ॥ వ్యసనములకు. 38

ప్రకృతి వ్యసనములు

ఆ॥వె॥ ఎందుచేత శుభము లెప్పుడు చెడిపోవు
నదియ తలఁప వ్యసన మనఁగఁ బరగు
వ్యసనియైనవాఁడు వెస నధోగతిఁ బడు
నటులఁగాన వ్యసన మడఁప వలయు ॥ 39

కం॥ దైవంబును మానుషమును
దైవము మానుషము రెండు విధములుగనే సం
భావితమగు వ్యసనము తా
మావరుఁ డిదిమాన్చి దండుపోవఁగ వలయున్ ॥ 40

కం॥ జలమును దెవులును మారియు
నల దుర్భిక్షంబు చిచ్చు ననుసైడు తెఱం
గుల వెలయు నెందుదైవిక
ములై నవ్యసనంబు లితరములు మానుషముల్ ॥ 41

కం॥ పౌరుషమున శాంతులచే
సారె విభుఁడు దైవికవ్యసన ముడుపఁ దగుఁగా
బౌరుషముచేత నీతివి
చారముచే మానుషవ్యసన ముడుపఁదగుఁగా ॥ 42

వ॥ రాజవ్యసనము. 43

కం॥ అతినిష్ఠురమగుమాటయు
నతిదండము వేఁట పాన మతివయు జూదం
బతిఘనమగుదుర్వ్యయమును
క్షితి నివి వ్యసనంబు లండ్రు క్షితిపతి కెంచఁగా ॥ 44

గీ॥ నిరత ముద్యోగవంతుఁడై నీతి నలరు
రాజు రాజ్యాంగముల నెల్లఁ బ్రబలఁజేయు
నటులఁగాకెందు వ్యసనార్తుఁడయ్యె నేని
తనదు రాజ్యాంగములనెల్ల తలఁకఁ జేయు ॥ 45

కం॥ అలధర్మార్థంబుల నా
కులుఁడగుచో మనసు దొట్రుకొని చెదరినచో
నిలతేనికి సన్మంతులు
దెలుపఁగఁదగు రాజచర్య ధీరత చెందఁగా ॥ 46

వ॥ మంత్రివ్యసనము. 47

కం॥ అలసత జాడ్యము గర్వము
గలహము చెప్పుట ప్రమాదగతి యుద్ధతియున్
బలువగు సప్తవ్యసనం
బులు మంత్రుల కెంచ వ్యసనములు ధరలోనన్ ॥ 48

కం॥ తనమంత్రిజనము వ్యసనము
గనినయెడ న్విభుఁడు శక్తిఁ గలిగినవాఁడై
య్యును ఱెక్కలు విఱిగిన పులుఁ
గనగాఁ బొడవైనపదవి నందకయుండున్ ॥ 49

వ॥ భండారవ్యసనము. 50

ఉ॥ సారమునందె యుండుటయు దొంగలచేఁ బడిపోవు టెంతయుం
దీరఁగ వెచ్చమౌట చెడదింటయుఁ బెక్కగఁ జోట్లమున్కి నిం
డారఁగఁ గూడబెట్టమి యనాదర భావముతోడ నున్కి భం
డారమునందునుండు వ్యసనమ్ములగున్ ధరణీ తలంబునన్ ॥ 51

కం॥ వసుధన్ భండారమునకు
వ్యసనంబులు చెందెనేని యందగు వసులుం
బొసఁగవు గన భండారము
వ్యసనము మాన్పంగవలె నవశ్యము పతికిన్ ॥ 52

కం॥ ధరభండారమె మూలము
నరపతి కని నీతిపరులనంగా వినుటన్
దొర యెప్పుడు భండారము
గరిమ మెయిం బ్రబ్బలుచుండఁగాఁ జేయఁదగున్ ॥ 53

వ॥ రాష్ట్రవ్యసనము. 54

చ॥ ఎలుకలు చిల్కలు న్మిడుత లెచ్చుగ వానలు వానలేమి దొం
గలు ప్రతిమూకలుం జనపు గల్గినవారల బాధ శత్రుమూఁ

తలు బసి చచ్చుటల్ దెప్పలు గ్రమ్మట భూపతిచేతిభంగముల్
బలవగు మాలిదంపుగను బట్టుటయుఁ వ్యసనంబుభూమికిన్ ॥

గీ॥ పాశుపాల్యంబు గృషియును బణ్య మనఁగ
బరగువార్తనె ప్రజలెల్లఁ బ్రతుకు చుండ్రు
వారు వ్యసనంబు చెందిన వారు సేయు
పనులుచేకూర వండ్రు భూపతికి నెందు ॥ 56

వ॥ దుర్గవ్యసనము. 57

కం॥ తనవును గట్టెలు చవసము
బసలేకుండుటయుఁ గోటపడుట యగర్తల్
రసములు యంత్రాయుధములు
నెసఁగమి దుర్గమున కెల్ల నివి వ్యసనంబుల్ ॥ 58

కం॥ ధర దుర్గమునకు వ్యసనము
పరగిన దుర్గంబు పనులు పసచెడు నివిలే
కిరవగు దుర్గముగల దొర
యరులకు మిత్రులకుఁ బూజ్యుఁడగు నెవ్వేళన్ ॥ 59

వ॥ బలవ్యసనంబులు. 60

వ॥ మఱియు వ్యసనయుక్తంబులగు బలంబులు పరిక్షిప్తంబును, విమానితంబును, వ్యాధితంబును, దూరాగతంబును, బరిక్షీణంబును, నభూయిష్ఠబలంబును, నవిక్షిప్తంబును, నంతశ్శల్యంబును, భిన్నగర్భంబును, నపసృతంబును, బరిమృష్టంబును మిశ్రంబును, నుపనివిష్టంబును, శూన్యబలంబును, మిత్రవిక్షిప్తంబును, బ్రహూతాగ్రజనంబును, నస్వామిసంహితంబును, భిన్నకూటంబును, దుష్పార్ష్ణిగ్రాహంబును, నంధంబును, విచ్ఛిన్న పీవధాసారంబును, స్వభూయుద్ధంబును, నవమానితంబును, శూన్య

మూలంబును, సభృతంబును, బరిశ్రాంతంబును, నవాగతంబును, ప్రతిహతంబును, స్వవిక్షిప్తంబును, ప్రసిద్ధమూలంబును, సస్పృత సంప్రాప్తియు, గళత్రగర్భంబును, నాశానిర్వేదయు, మాష్ట్ర యుక్తంబు ననునివి ముప్పదినాలుగు తెఱంగులై యుండు నందు వ్యసనంబులు పరిహరింపరానివి యిరువది యొక్కటియును, వ్యసనంబులు పరిహరించవచ్చునవి పదమూడునుం గలవు. తత్ప్రకారంబు వివరించెద. 61

## పరిక్షిప్తాది బలలక్షణము

సీ॥ అరిచుట్టుముట్టిన నటుత్రోవఁగానక
చిక్కియుండినఁ బరిక్షిప్తబలము
జనపతిచేఁ దిరస్కారంబు గడుఁజెంది
మదిరోషమంద విమానితంబు
ప్రతిరోగములచేత నలసి యేపనులకు
నసమర్థమైనచో వ్యాధితంబు
నతిదూరగతిచేత మృతిఁజెందుగతి నా
ధావళి విడుచు దూరాగతంబు

గీ॥ శస్త్రములు శూరులును మును గూలిపోయి
క్షీణమై యుండు నల పరిక్షీణ బలము
వ్యసనమును జెంది ముదుఁగుచున్నట్టికతనఁ
బతికినప్పటి కని సేయఁ బనికిరాదు ॥ 62

సీ॥ అని సేయ నిట్టట్టు చనరాక యిఱుకున
మెలఁగఁ గూడని యభూయిష్ఠబలము
బహుదేశముల కడపటనుండి వేళకుఁ
జేరనేరని యవిక్షిప్తబలము

నహుమూఁకలోన నెంతయు శత్రులుండిన
సదరు నంతశ్శల్య మనుబలంబు
నన్యోన్య కలహంబు నంది యైక్యముగాని
భిన్నగర్భంబను పేరిబలము

గీ॥ నొక్కరి ప్రదేశమ వ్వల నుండి చేర
ననువుగానక యుండిన నపసృతంబు
వ్యసనమునుజెంది ముడుఁగుచున్నట్టి కతనఁ
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 63

సీ॥ పితికిపంతంబునఁ బెగడెడుదశపాయి
నొనగూడుఁబరిమృష్టమనుబలంబు
విమతసైన్యముగూడి విడిసియుండుటఁజేసి
మించి రానేరని మిత్రబలము
మునుశత్రుల సమీపములనుండి యేతెంచు
నుపనివిష్టంబన నొప్పుబలము
తరతరంబును గొల్చి,తగు ప్రాఁతమూఁకలై
శూరత గల్గని,శూన్యబలము

గీ॥ సదరిమిత్రసహాయార్థమనిపినట్టి
మిత్రవిక్షిప్తమని మొప్పమేటి భటులు
చాలఁగూలినఁ బ్రహతాగ్రజనబలంబుఁ
బతికి నప్పటికనిసేయఁ బనికిరాదు ॥ 64

సీ॥ అధిపులతోఁ బాసియాధారమెడలిన
యస్వామిసంహిత మనెడి బలము
నధిపులు గూలిన యప్పు డొండొరులకుఁ
గూటమొందని,భిన్నకూటబలము

వెసఁగ మిత్రులచేత వెతఁజెందు మష్పార్ష్ణి
ప్రగ్రాహమును పేరఁగలబలంబు
జగడంబులోన నెచ్చరికెకాఁడెడల్పిష
నటు ముంచుఁ గానని యంధబలము

గీ॥ ధాన్యసంప్రాప్తి పుట్టముల్ దనకు రాక
జడియువిచ్ఛిన్న పీవధాసారబలము
వ్యసనములయందె ముడుఁగుచు న్నట్టికతనఁ
బతికి నప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 65

వ॥ ఇంక వ్యసనంబులు పరిహరించి యనికిం బనికివచ్చు బలంబు
లెవ్వియనిన. 66

బలవ్యసన పరిహార విధానము

సీ॥ రిపులు మార్గము గట్ట నుపరుద్ధ మది పెర
త్రోవ నేతెంచిన దుర మొనర్చు
బహుమాన మొందని బలమమానిత మగు
నది యిచ్చి మన్నించ నని యొనర్చు
నిలుపఁగాఁ దావులేనిది శూన్యమూలమౌ
నది తావుగల్పించ నని యొనర్చు
నభృతంబు జీతంబు నందకుండినబలం
బదిజీత మిచ్చిన నని యొనర్చు

గీ॥ నలసి యున్నఁ బరిశ్రాంత మనఁగ బరఁగు
నలయికలు దీర్చినదియును నని యొనర్చు
నిట్టిబలముల వ్యసనంబు లిటుల మాన్పఁ
బనికి వచ్చును మగుడ భూపాలునకును ॥ 67

సీ॥ అడిగిన నీకున్న నాశచేవెతఁజెందు
నాశావిని ర్వేదియనెడి సైన్య
మది యడిగిన దెల్ల నప్పు డొసంగిన
నది బలంబులఁగూర్చి యని యొనర్చు
దూష్యులతోఁగూడ దూష్యయుక్త మటంచు
తద్దూష్యులగువారిఁ దలఁగ ననిచి
యైన నాప్తులు శూరులగువారితోఁ గూర్చి
యనికిఁ బంచినదైన నని యొనర్చు
గీ॥ నధికమగునేర్పు లీరీతి నాత్మనెఱిఁగి
తనకు విజయంబు చేకూడఁ దలఁచెనేని
యిటుల బలముల వ్యసనంబు లెల్లమాన్పఁ
బనికివచ్చును మగుడి భూపాలునకును॥ 68

కం॥ బలముల వ్యసనము లీగతి
నలవునఁ దా మాన్పఁడేని యుందగి పనులున్
గలుగఁగ నేరవు గావున
బలముల వ్యసనములు మాన్చు పతి జయమొందున్॥ 69

వ॥ ఇంక మిత్ర వ్యసనము. 70

కం॥ ఇల సప్తవ్యసనంబుల
వలనం బనియించునట్టి వ్యసనంబులు వై
రులచే నొచ్చుట దైవము
వలనన్ జెడు టివ్వి మిత్రవ్యసనము లరయన్॥ 71

కం॥ మిత్రుఁడు వ్యసనము నరదిన
మిత్రుఁడు చేకూర్చుపనులు మిగులగఁ జెడుఁ ద
న్మిత్రుని వ్యసనము మాన్చిన
ధాత్రీపతి యెట్టివేళఁ దా జయమందున్॥ 72

గీ॥ ధరణి రాజ్యాంగముల యందుఁ దగఁబు నిట్టి
వ్యసనములు మాన్పఁగాఁ దగు నద నెఱింగి
యటుల మాన్పక మదమున నెనయు భూమి
పాలుఁ డరిరాజుచేఁ బరాభవము నెందు॥ 73

వ॥ ఇట్లు రాజు మొదలుగాఁ బలుకంబడిన యంగంబులకుఁ బ్రాప్తంబులైన వ్యసనంబులలోన మొదటి మొదటఁ జెప్పంబడిన యంగంబుల వ్యసనంబులే గురుతరంబులనుచు నుండఁ గావున. 74

సప్త వ్యసనవర్గ ప్రకరణము.

కం॥ నరపతి దా వ్యసనంబులఁ
బొరయనిచో రాజ్యమెల్లఁ దోపగ నోవుఁ
నరపతి వ్యసనము చెందిన
నరయుచు రక్షింప రాజ్య మసమర్థ మగున్॥ 75

కం॥ తన సచివుని ప్రజ దుర్గం
బును భండారంబు సైన్యమును జుట్టము నేం
డును వ్యసన మందకుండగ
మనిచిన జనపతి త్రివర్గ మహిమఁ జెందున్॥ 76

ఆ॥వె॥ శాస్త్రదృష్టిలేని జననాయకుని నంధుఁ
డనుచు నండ్రు ప్రాజ్ఞులైనవారు
అంతకంటె నంధుఁడగుచ దివియును గ
ర్వమున మంచినడక వదలునతఁడు॥ 77

కం॥ జనపతి యంధుం డగుచో
ననువగు మార్గంబు మంత్రులందింత రిలన్
మును జదివి మత్తుఁడైనన్
దనతోఁ గూడంగఁ బ్రకృతితతి చెడఁజేయున్॥ 78

కం॥ కావున నమాత్యమతమున
సేవలసను మెలఁగి శాస్త్రదృష్టి వెలయఁగా
దా విడువవలయు వ్యసనము
లావల ధర్మార్థహాని యవరవ యుండన్ ॥ 79

## సప్తవ్యసనములు

ఉ॥ పలుకుల వెట్టి యర్థములు పారగపైచుట యెక్కు దాట్ఞనాఁ
గలయవి క్రోధజంబులయి కన్పడుచుండు ధరాతలంబునన్
వెలఁదియు మద్యపానమును వేఁటయు జూదముఁ గామజంబులై
నలువు దలిర్చు నిట్టి వ్యసనంబులు భూపతి మానఁగాఁదగున్ ॥

వ॥ అది యెట్లనినను తత్ప్రకారంబు గ్రమంబున వివరించెద వాక్పారుష్యమునకు. 81

కం॥ వెఱవొసఁగి నిరర్థకమై
చఱకరిగలపలుకు బలుకగా దెవ్వరితో
మఱి పగఱను మృదువాక్యమె
మఱవక దనవారిఁజేసి మనఁగా వలయున్ ॥ 82

కం॥ కారణములేకయే వా
క్పారుష్యము వెలయఁగ్రోధగతిఁ బలికెడు నా
క్రూరునకు వెఱచులోకం
బారయ మిణుగుర్లు చల్లు నగ్నింబోలెన్ ॥ 83

కం॥ కఱగరి బలుకును గైదువ
మెఱయుచుఁ బరమర్మభేదమే చూపినచో
గుఱుతగుఁ బ్రతాపవంతుఁడు
మఱిమఱియును దెరలిదెరలి మహిఁ బగఱయగున్ ॥ 84

కం॥ ఇల జనులకుఁ బరుసనగాఁ
బలుకుచు వెఱపింపవలదు పతి తియ్యనిప
ల్కులె పలుకవలయు నటులం
బలికినచోఁ బేదనైనఁ బ్రజ సేవించున్ ॥ 85

కం॥ జగతిన్ దుర్జనసాధక
మగు నాజ్ఞయె దండమనఁగ నగు దండంబున్
దగినయెడఁ జేయఁగాఁ దగుఁ
దగుదండము సేయఁ బతిని ధర నుతియించున్ ॥ 86

మ॥ తెలియ స్వేక్కసమైన యాజ్ఞగల ధాత్రీపాలుఁ డెంచం బ్రజన్
దలఁకం జేయుఁ, దలంకుచుండు ప్రజ సంతాపంబుతో వైరులం
గలయుం, దత్ప్రజఁ గూడమించునరి సంఘం బందుచేతన్ క్షయం
బలసం గావున భూప్రజం దలఁకఁ జేయంగాదు భూజానికిన్ ॥

కం॥ ప్రజలను బాలించిన భూ
భుజుఁడు కడుం బ్రబలుచుండు భువి నెల్లపుడున్
ప్రజలు చెడఁ బతియుఁ జెడు నా
ప్రజలు కడుం బ్రబలఁ బతియుఁ బ్రబలుచు నుండున్ ॥ 88

కం॥ ఎంతటి యపరాధుల ప్రా
ణాంతకమగు నాజ్ఞ సేయు టనుచితమగు భూ
కాంతుఁడు రాజ్యముఁ జెఱచిన
హంతనె దండింపఁదగు నయస్థితి మెఱయున్ ॥ 89

వ॥ అర్థదూషణము. 90

కం॥ చెఱుపంగఁ దగినవారలఁ
జెఱిపెదనని కినుకఁ బ్రియముచేసిన నది తా
ధర నర్థదూషణం బనఁ
బరగున్ నీతిజ్ఞులైన ప్రాజ్ఞులచేతన్ ॥ 91

కం॥ వారణములేక కోపము
పేరినగల ధనము వెచ్చపెట్టుట కొఱగా
దారయ నాత్మ హితంబుల
నేరుపుతోఁ గోరునట్టి నృపతికి నెంచుఁ ॥ 92

వ॥ మృగయావ్యసనము. 93

సీ॥ వాహనం బెక్కుచో వచ్చిన బడలిక
వాహనంబులఁ దోలి వడఁబడుటయు
వాహనంబులు దనవైపున రాక యొం
డొకదిక్కుఁజేర్చఁ జేటొదవు టెంచు
నాఁకట దప్పిచే నలయుట ప్రజలకు
నన్నపానాదిక మమరమియును
జలిగాలి యెండచేఁ గలిగినపీడలు
ప్రతియానములచేతఁ బరగుపీడ

గీ॥ వసపుచే తెల్లుచే వెండి యినుపచేతఁ
జెట్లచే గట్లచే ముండ్ల పట్లచేత
వేళ్ళచే నీళ్ళచే నాటవికులచేత
వెలయుపీడలు వ్యసనముల్ వేఁటలందు ॥ 94

కం॥ పుట్టల మిట్టల గుట్టల
పట్టుల మఱి మోటచెట్లపట్టున నెపుడుఁ
బెట్టుకొను వెతలు వేఁటఁ
బుట్టెడు వ్యసనంబు లంద్రు బుధు లెచ్చోటఁ ॥ 95

వ॥ మఱియును. 96

సీ॥ కానల నదులను గట్టుల గుహలందుఁ
బొదలచెంతల దక్కి పొంచియుండి
కినుకతోఁ బాశెగాండ్లను చోడి దొరలను
దను గడంగించినఁ దగులువడుట
యెంతయుఁ గినుకతో నెడసియుండెడుఁ దన
బలముచే దాయాదకులముచేతఁ
ద్రోవలఁ గడు మోసపోవుట మఱియును
ద్రోవల భ్రమయుచుఁ దొట్రుపడుట

గీ॥ యాది యగుదోషములు వేఁటలందు నెపుడుఁ
బొడము గావున నెప్పుడుఁ బుడమిలోన
వేఁటలాడెడితమకంబు విడువవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ ఎలుగులు సింగముల్ పులులు నేసుఁగులుం బెనుబాము లాదిగాఁ
గలిగినక్రూరజంతువులు గ్రమ్మ భయమ్ములు మీఱఁ గాదుచి
చ్చులుపడిఁ జుట్టికొంటయును జూపుల దిగ్భ్రమ మావహిల్లఁ దా
నలఁగుట వేఁటయందు వ్యసనంబులు రాజున కెంచిచూడఁగన్ ॥

వ॥ వేఁటయందు షడ్గుణములు. 99

చం॥ నిలుకడ గల్గులక్ష్యములు నిల్కడలేక చలించులక్ష్యముల్
బలువిడినేయు, టామము కఫంబును గ్రొవ్వు నడంగిపోవుటల్
మెలఁగెడు వేళలన్ శ్రమము మించకయుండుట, జంతుజాతికిన్
గల భయ రోషముల్ దెలియఁగల్గుట, వేఁటగుణంబులెన్నఁగన్॥

వ॥ ఇట్లయ్యును. 101

క॥ ఇలఁ బ్రాణహారకములై
బలసినదోషములు పెక్కు ప్రాప్తించుటచేఁ
దలఁప మహావ్యసనంబై
పొలుపొందుం గాన వేఁట పోఁదగ దెందున్ ॥ 102

వ॥ అయినను మతి యొక్క తెలివిగైన సాహస మొదవైన యుచిత
క్రియలచేతనే వేఁటయందలి మంచి గుణంబులు గలుగవలయు
నుపాయంబులు గలవు గావునఁ దత్ప్రకారంబు వివరించెద. 103

సీ॥ వేఁటాడఁగా నిచ్చ విభునకుఁ దగ్గినా
దనపురంబునకుఁ బ్రాంతమునఁ గల్గు
మలచెంతనైన నేఱులచెంతనైనను
దగి మృగంబుల నెందు దాఁటరాని
యగడితఁ జుట్టిరా ననువొంది రమ్యమై
పొదలు ముండులు గల్గు పొదలు లరలు
విషకారణములైన వృక్షబలములేక
జలము బచ్చికబైళ్ళు చాలఁగల్గి
గీ॥ యర్ధయోజన పరిమితంబైన వైశాలు
నిడువు గల్గుచుఁ దగునట్టి యడవి యొకటి
యాప్త తతిచేత నిర్మింప నర్హ మంత్రు
వేఁట లాడెడుకొఱకు భూవిభున కెందు ॥ 104

సీ॥ కప్పుపుఖ్ఖుల యొప్పుఁ గప్పుచాయలు గల్గి
పలుచనై కాయలుఁ బండ్లు గల్గి
మసలు కొల్పెడి తావి పూవుగుత్తులు గల్గి
సెలుతు పేరెఱుగు బ్రమాఁకులునుగల్గి

భృంగీప్రసంగీత భంగీతతులు గల్గి
శారికా కీరికా సమితిగల్గి
హరిణీ కలభజాల కరిణీకులము గల్గి
వల్లిమతల్లికావళులు గల్గి

గీ॥ చాల లోఁతులులేక మొసళ్ళులేక
శోభితములైన కొలఁకుల చోట్లు గల్గి
మిగులఁ జెలఁగెడు వనము నిర్మింపఁజేయ
వలయు నాప్తులచేత భూవల్లభుండు ॥ 105

సీ॥ పోవఁగాఁ గొట్టిన పుట్టలు మిట్టలు
శిలలు మొద్దులు ముండ్లచెట్లు గల్గి
నిండారఁ బూన్చిన నెఱియలు బొఱియలు
గుంటలు గోదముల్ గోతులు గల్గి
పరిఖవెంటనెయంటి పలుదెఱంగుల తీవ
లల్లిబిల్లిగ నిండ నల్లికొనిన
రాజితంబగు వనరాజిచేఁ జుట్టిరాఁ
జెలువొంది వెలిని మ్రాఁకులును లేక

గీ॥ మిగుల వెడలుపు చదరమై మెఱయునట్టి
భూమియును గల్గి తన శత్రుభూపతులకుఁ
జేరఁగా రాక రమ్యమై చెలఁగు వనము
బాగుసేయించవలయు భూపాలుఁ డెపుడు ॥ 106

వ॥ మఱియు నాటవికతతుల మనంబు లెఱుంగంజాలి తనకు నాప్తులుం గ్లేశాయాస సహిష్ణువులైన జనంబులచేతఁ దద్వనరక్షణంబు సేయింపుచునుండెడి మృగయాధ్యక్షుండైన యతండు వివిధ జాతుల మృగంబులం బట్టితెప్పించి యందు దుష్టమృగంబులైన

వానికి గోళ్ళును గోలలును గొమ్మలునుం గొట్టించి యంటు విడి
పించఁజేయ వలయు నంత. 107

కం॥ ఇతరంబగు పని మఱుపక
చతురత లివగల్గి యాప్తజనములతోడన్
బతి ప్రొద్దున వేఁటాడగ
నతి సన్నాహమున వనికి నరుగఁగవలయున్ ॥ 108

కం॥ జనపతి వేఁటాడగఁ ద
ద్వనసీమనుజెందు నట్టితఱి నుండంగాఁ
జను నాప్తబలము ప్రాంతం
బునఁ గడు నాయత్తపాటు బొదలుచునుండన్ ॥ 109

కం॥ అడవుల వేఁటాడంగాఁ
దొడరెడి సద్గుణములెల్ల దొరకుం దొరకున్
బడమిం గల్పితవనముల
యెడలనె క్రీడించు నిచ్ఛ యెసఁగినచోటన్ ॥ 110

ఆ॥వె॥ వేఁటయందు నిట్టి విధము మంచిది యని
పలుకుదురు ధరిత్రిఁ బ్రాజ్ఞులెల్ల
నటులఁగాక వనికి నవనీశ్వరుండు దా
బోయరీతి వేఁట బోవరాదు ॥ 111

వ॥ జూదమునకు. 112

సీ॥ ఎంత ధనంబైన నిసుమంత సేపులో
పల నాశమౌటయుఁ బరుసదనముఁ
గోప మందుటయుఁ బల్కులచేత జగడంబు
నాయుధంబులచేత నగు కలహము

పల్లు అలాడుట ధర్మముల్ చెడుటయుఁ
జేయంగఁ దగుపనుల్ సేయలేమి
యతిలోభ మంచుట యార్యుల విడచుట
దుర్జనసంగతి దొరకుటయును

గీ॥ జేటునకుఁ గారణంబులు చేకురుటయు
వైరములు చెందుటయు సిగ్గు వదలుటయును
మొదలుగాఁ గల్గు బహుదోషములను జెందు
హోళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 113

సీ॥ కల యర్థములమీఁదఁ గాంక్షలు లేకుండు
టర్థంబు లేనిచో నాశపడుట
సంతోషమును మనస్తాపంబుఁ జలమును
గడుఁ బ్రతిక్షణమందుఁ గలుగుటయును
బలకంబు మొదలుగాఁ గలిగిన దేహర
క్షణములయందు భోగములయందు
నాదర మించుకయైన లేకుండుట
మెలఁగకుండుటచేతఁ గలిగినట్టి

గీ॥ దుర్బలత్వంబుచేఁ జాలఁ దూలుటయును
మంచి శాస్త్రార్థముల నుపేక్షించుటయును
మొదలుగాఁ గల్గు బహు దోషములను జెందు
హోళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 114

కం॥ మలమూత్ర నిరోధంబులఁ
గల పీడలు దప్పికొనుటఁ గల పీడల్గా నాఁ
కలిఁ గొనుటవలనఁ బొడమెడి
యలమటలుం జూదమాడు నతనికిఁ జెందున్ ॥ 115

సీ॥ నలుఁడేల కోల్పడి కులకాంత నడవిలో
పల డించి తా నడబాల యయ్యె
ధర్మజుం డాలిని ధర నోడి యిలనెల్ల
విడచి కంకుండన విరటుఁ గొల్చె
దంతవక్త్రుండును దా బలభద్రుచే
గుఱుతుగా బండ్లూడఁగొట్టఁ బడియెఁ
గుండినపుర మేలుచుండు రుక్మవిభుండు
జయము పోనాడి నాశనముఁ జెందె

గీ॥ జూదమాడియె కాదె యీ జూదమెంత
వాని నైనను భ్రమయించు వాసి చెఱచు
జూదము సకలగుణములఁ జూరలాడు
జూద మెంతటివానికిఁ గాదు ధరను ॥ 116

కం॥ జూద మనర్థముఁ దెచ్చుం
జూదంబున భేద మందుఁ జుట్టఱికంబున్
జూదమున నెయ్యు ముడుగున్
జూదమె పో కాని దెంచి చూడఁగఁ బతికిన్ ॥ 117

వ॥ స్త్రీవ్యసనానకు. 118

సీ॥ కార్యకాలంబులు గడచిపోవుటయును
నర్థంబు ధర్మంబు నలఁచిచెడుట
యెవ్వేళ నిలువెళ్ళ నెఱుఁగని కతన స
జ్జనులు మంత్రిజనంబు గినియుటయును
ధరణిపైఁ బక్షపాతంబునఁ జేయఁగా
రాని కార్యంబైనఁ బూనుటయును
దాల్మి లేకుండు టెంతయుఁ గోపమందుట
వైరంబు సాహసవర్తనంబు

ఆ॥వె॥ లాదిగాఁగ గల్గినట్టి దోషము లెల్ల
వెలఁదిపలన నెపుడుఁ గలుగుచుండు
నటులఁగాన నది మహాదోషయుక్తంబు
విధుఁడు దీనిఁదెలిసి విడువవలయు ॥ 119

కం॥ చెలువల మోములె చూచుచు
దలపడి వేగిరముచెందు సర్వాత్మలకుఁ
గల కోర్కెలెల్ల జిహ్వన
ములతోఁదంగూడ నాశముం గనకున్నే ॥ 120

వ॥ పానమునకు. 121

సీ॥ తెలివిలేకుండుట పలుమాఱు బెగడుట
నెక్కుటయును శోక కష్టమియును
గల్లలాడుట బంధుగణము బోనాడుట
చలఁపు ప్రజ్ఞయు మతి తలఁగుటయును
బనిలేనితటి బెదఁబడుట నవ్వుటయును
బ్రాణబాధయును వంద్రదయును గనుట
సత్పురుషులతోడిసంగతి వదలుట
దుర్జనసంగతి దొరకుటయును
గీ॥ గడగడ వడంకుటయు జారిపడుట రడు ను
నర్థ మొందుట స్త్రీగోష్ఠి యధికమగుట
యాదియగు దుర్గుణంబుల నందుచుండు
మద్యపానంబుఁ దగిలిన మానవుండు ॥ 122

కం॥ పానవ్యసనముఁ జెందిన
మానవుఁ డెచ్చోటనైన మదమున మెలఁగన్
బానమదంబున నెచ్చో
నైన బహిష్కార మొంది యధమతఁజెందున్ ॥ 123

క॥ భృగుసుతుఁడను యోగీశ్వరుఁ
డగణితమతిశాలి షడ్గుణైశ్వర్యయుతుం
డగు శుక్రుఁడుఁ బానముచేఁ
దగి మదమున శిష్యవరుని దండిగఁ ద్రావెన్ ॥ 124

క॥ కులమును బలమును వేదం
బులు శాస్త్రంబులును శీలమును సంపదయుం
గలవారైనను దానం
బలవడుటనె చెదరె యాదవాంధకవృష్ణుల్ ॥ 125

క॥ సిరిఁ బొలియఁగఁజేయు వ్యసనము
లరయంగా నేడుతెఱఁగులై యవి యెపుడున్
ధర నివి యొక్కటియె నరుఁ
జెఱచున్మతి యిన్నిగూడఁ జెఱచుట యరుదే ॥ 126

క॥ మగువల నెంతయుఁ దగిలినఁ
వగురీతుల మద్యపాన తత్పరుఁడైనన్
దగు కొంత వేఁట జూదము
మిగులం గీడౌట విడచి మెలఁగఁగవలయున్ ॥ 127

చం॥ తలఁపఁగ మిక్కిలిన్ విషయతత్పరతన్ గలిగించుఁ జెప్పఁగా
నలవడు వేదశాస్త్రముల నన్నిటి దూరఁగఁజేయు సద్గుణం
బులను మహత్త్వముం దెలియు బుద్ధియుఁ జెడ్డతనంబు సంపదన్
జలనము నందఁజేయును వెసన్ వ్యసనంబులు దాఁట శక్యమే ॥

క॥ వ్యసనములు గలుగు నరపతి
వసుధం బనదొఱఁగు వైరివర్గముచేతన్
వ్యసనములు లేని నరపతి
యసదృశగతి మెలఁగి గెలుచు నరిసంఘములన్ ॥ 129

ఉ॥ ఇదియిది దీనికిం దగి రహించు నటంచును గోర్కి మీఱఁగా
మదిఁ దలపోసి తాఁబ్రకృతి మండలి సత్క్రియతోడఁ గూర్చి న
మ్మదమున నీతి రీతులనె మానవనాథుఁడు దా మెలంగినన్
వదలనిగౌరవంబునఁ ద్రివర్గముఁ జెందుఁ బ్రతాపశాలియై ॥ 130

చ॥ అనుపమదాన దానయుతహస్తిలసద్బలవాహచక్రపా
లనపటుసార సారసవిలాసవిలోకన లోకనవ్యన
ద్యనుత విహార హారరుచివిశ్రుతకీర్తినివాస వాసవా
త్యసమమనోజ్ఞభోగ విభవానిశ బంధురబంధురక్షకా ॥ 131

క॥ దీప్తోత్సాహ మహోజ్జ్వల
సప్తాంగ గుణాగుణజ్ఞ సకలదిగంత
వ్యాప్తప్రతాప వరజల
జాప్తాన్వయరామభావనాసక్తమతీ ॥ 132

కవిరాజవిరాజితము ॥
చటుల తురంగమ చంక్రమణ క్రమనైపుణ విరాజితసారనయో
ద్భటపటహవ్రజ ధంధణధంధణ దారుణనిస్వన దారితహృ
త్పుట మదశాత్రవ భూప ప్రతాపజ భూరివిభాసురభూధరిత
స్ఫుటవలయాచల భూసుతసద్గుణభూషణ నిత్యవిభుత్వయుతా ॥

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు
నుత్సాహ ప్రభుశక్తియు సప్తాంగప్రయోజనంబులుఁ దద్వ్యసనంబులు నన్నది షష్ఠాశ్వాసము. 134

ఉ॥ సైపులు పంక్తి పుంజగలపట్టున సైపులసీమమించటన్
ఘోరమొనింపు దండు చనఁదొల్పఁగ సంగతి దండువెన్నఁచున్
సైపులు సూరఁబట్టి పరిపంథుల జీవనముల్ హరించినన్
సారబలంబుచేఁ దనరి శత్రుల గెల్చును నిర్భయస్థితిన్ ॥ 6

చం॥ వెనుకటిసైపలం దనదు వెన్కసురాఁ గడు పట్టిపెట్టి పెం
పునఁ బరిచర్యలం దెలిసి ముందరఁగల్గుభయప్రదేశముల్
గనిమలు తెన్నగా నెఱిఁగి కంటకశుద్ధి యొనర్చి దానుదో
నమపమమార్గమందుఁ బతి యాత్ర సనంపగ నప్రమత్తుఁడై ॥

చం॥ సమపమునచోట్ల నంతటను జాలఁగ మిట్టలునైనచోట్ల నె
య్యముగలసేన మున్నుగఁ బ్రయాణమువోవుట యొప్పు సైన్యస
ంక్రమములయందుఁ దానెఱుఁక గల్గుచు నాప్తుఁడుగాక యన్నపా
నముల సమృద్ధిఁజెంది జతనంబుగ దండు చనంగఁ జెన్నగున్ ॥

ఉ॥ జలము పసంబునుం గలుగు చాయనె వేసవి సైరిపించఁ దో
పలయు మదేభముల్ జలమువల్లఘటిల్లెడు సౌఖ్యమొందఁగా
జలములు లేకయుండినను సామజపంక్తులకెల్ల వేసవిం
గలుగుచునుండుఁ గుష్ఠములు గాటపుటెండలఁ బుట్టువెట్టచేన్ ॥

కం॥ ఒక్కయెడ నిలుచునప్పుడు
గక్కసమగు వెట్టనొంచుఁ గరి బృందములన్
ముక్కలిఁ బ్రయాణముల నిడి
వెక్కసమై నొంపకున్నె వేసవివేళన్ ॥ 10

కం॥ నీర్వములు లేని వేసవి
సారెకు దురపస్థఁ జెందు జంతువు లెల్లన్
వారణ పంక్తులకైనం
దీరనితాపముల నప్పుడె దేహము వెంచున్ ॥ 11

ఉ॥ ఘస్మను షంచివాసనలు గ్రమ్మమదమ్మలు గల్గి కొమ్మలం
జిమ్మట సస్యసూపములు చేసినగట్టులు గల్గి మీటి కా
ర్గ్రిమ్మచుఁ గప్పు ఒబ్బుగమికప్పులయొప్పులు గల్గుచుంటి సం
ఘమ్ములయందెటా ధరణికాంతులరాజ్యభరంబు నిల్చుటల్ ॥ 1[illegible]

మ॥ అవిచూడఁగా నడగొండలో యనఁగ నీలాభ్రంబులో నాఁగ గ
ట్లవియం గొమ్ములఁ జిమ్మనోర్చి మదధారాసారతం బేర్చి చా
త్రవులం గోరుపులాడనేర్చి తగు నుద్యద్భద్ర నాగేంద్రముల్
భువి రాజ్యాస్పదహేతువైనవి గదా భూపాలకశ్రేణికిన్ ॥ 1[illegible]

ఉ॥ ఘోరతపోటునేర్పు సముదోకయుఁ గల్గిన మాపటీఁడు వెం
పారఁగ నెక్కి యుక్కెసఁగి యాయితపాటున మీఱు వారణం
బేరణపంచునైన జవమెచ్చినవాజుల నాఱువేలఁ దా
ధీరతమించఁ ద్రుంచు వినుతించు సుదంచితసాహసంబునన్ ॥

కం॥ జలముల నడవుల నప్పుల
బలుదిన్నెల సమములైన పట్టుల వడిఁ గో
టలును గడవు వడియేనుం
గులు గలిగిన దొరకు దొరకుఁ గోరిన జయముల్ ॥ 15

కం॥ ఏతెరువు నీళ్ళు గలయది
యేతెరువు పరభయంబు లెసఁగక తగుఁ దా
నాతెరువునఁ జనవలయుఁగా
భూతలపతి బలము శ్రమముఁ బొందకయుండన్ ॥ 16

## దండయాత్రా విధానము

సీ॥ అధిపతి దండెత్తునట్టిచో క్షాత్రశ
త్రుండును వెనుక శత్రువుల రేఁచు
నదియు రంధ్రము గాన నహితులౌవారెల్లఁ
గడు ఘనంబుగఁజేయఁ గడఁగుచుండు

బ్రతికి ముందఱవచ్చుఫలమున కంటెను
వెనుక శత్రులపోరె ఘనము దెలియ
వదిగాక కాననియర్థంబుకొఱకునై
చేకొన్నయర్థంబు చెఱుపరాదు

గీ॥ కాసఁ దనబల్మి వైరుల ఘనతఁదెలిసి
వెనుక శత్రుల పగమాన్చి విమతుమీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 17

సీ॥ తనకుఁ బిఱుంద శాత్రవుఁడున్నచోఁ దన
కతఁడునులోఁగక యరిగెనేని
వెనుకటి శత్రువు వేగ ఖేదముచెంది
యలమట నొందించు నటులఁ గానఁ
దనకుఁ బిఱుంద ముందఱఁగల్గు శత్రుల
నడఁపగా నోపినయట్టి శక్తి
గలుగు వేళలను విక్రమయుక్తి చే మించి
ఘనములౌ ఫలములు గలుగనెంచి

గీ॥ తనకు నెలవైనపట్టణంబునకు రక్ష
ణమ్ము గావింపఁదగినబలమ్ము నుంచి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 18

సీ॥ అరయంగ నిఱువదియాఱగు సంఖ్యఁ దనరుభటుల్
గలుగు చేరువయ వర్గంబటంద్రు
ధారుణీస్థలి నిట్టిసేరువ కొక్కొక్క
ఘనుఁడైన సేరువకానిఁ గూర్చి

పెక్కు చేయవలయు బెక్కు చేరువకాండ్లు
గలిగిన తన యాప్తబలము నేర్చి
తన పట్టణముఁగాప నొనరింపఁగాఁ దగు
నిటుల నేయపకాండ్ర నేర్పరింపఁ

గీ॥ బరుల కెంతు నభేద్యమై పరగుచుండు
గాన నీరీతి నొనరించి ఘనత మించి
యుండు గదలంగవలయు సుద్దండలీల
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 19

సీ॥ తనకు సహాయమౌ దైవంబుచేత సు
వ్యక్తుఁడై దండెత్తుచుండు రాజు
ముందరికి సపత్న్యమును జను వార్యంబు
వెనుక శత్రుని రాక యొనయు నంత
యొక్కవేళనె కల్గియుండినఁ బదరాతి
దళవాయినైనను దనయునైనఁ
దన బలంబులలోనఁ దగినట్టి నాలవ
పాలైన మూఁడవ పాలునైన

గీ॥ బలము నొనఁగూర్చి ముందరి పగఱమీఁద
మునుపుగా నంపి తా నిల్చి వెనుక పగఱ
నుడుగఁగాఁ జేసి కదలుట యొప్పునండ్రు
దండయాత్రావిధిజ్ఞు లీధరణిలోన ॥ 20

## కోపద్వైవిధ్యము

వ॥ మఱియు నాంతరకోపంబును బాహ్యకోపం బనఁగ రెండు తెఱంగుల కోపంబులు గలవు. వానియందు నాంతరకోపంబ యధికంబగు నటులైనను నయ్యిరుతెఱంగులవారి కోపంబులు వారించి

మఱి యభీష్టంబుల నొనర్చి వారం దనవెంటఁ గోల్కొని పన
పలయు న య్యాటవెలంగులవారి కోశంబు లెట్టిపనిన. 21

సీ॥ సుతమంత్రిహిత పురోహిత నిజవంశజ
సేనాధిపతులు ప్రధానజనము
లంత్రము ధాపణి వీరలందు నొక్కనికోప
మైన నాంతరకోప మనఁగఁబరఁగు
గడిఁగాచువారలు సడపులకడ నుండు
ప్రజలును మఱియెంచ బాహ్యజనము
లరయంగ వీరలయందులో నొక్కని
కోపమైనను బాహ్యకోప మనఁగను

గీ॥ దనకు నాప్తులు చతురులై తగినయట్టి
మంత్రిజనములచేతను మనుజవిభుఁడు
తెలియఁదగు నిట్టికోపముల్ తేటపడఁగ
మించి వారల శాంతిఁ బొందించుకొఱకు ॥ 22

గీ॥ ఎట్టిరీతినిఁ దప్తులై యెడసి పగఱఁ
గూడుకొనిపోవ రటులఁ దత్కోపమడఁప
నమరు సామాదులగు నుపాయములనైనఁ
గట్టుకొని వారి విరిపోటు పెట్టియైన ॥ 23

కం॥ హయములును భటులు ఛచ్చుట
క్షయమగు ధనసంబు బసిఁడి కడు వ్యయమైనన్
వ్యయమగు నిటులన్ క్షయమును
వ్యయమగు పయనంబు మానవలయుం బతికిన్ ॥ 24

కం॥ ఫలమున్ వశ్యము దనకుం
గలయది వేఁ జేతి కిచ్చుగతి వేగమె కా
గలయది వ్యయప్రయాసము
గలిగినయదియైన దండు గదలఁగవలయున్ ॥ 25

కం॥ ఏనుఁగులకు గుఱ్ఱములకు
మానుసులకు నొప్పిదాఁకి మఱి ఫలసిద్ధిం
గానక నొగిలెడు బనికిం
దా నెందును దండుపోవఁ దగ దధిపతికిన్ ॥ 26

## కార్య వ్యసనంబులు

తే॥ తనకున్ శక్యముగాని వస్తువులమీఁదన్ యత్నముల్ సేయుటల్
దనకున్ శక్యములైన వస్తువులమీఁదన్ యత్నముల్ మానుటల్
దనకున్ శక్యములైన వస్తువుల వేళన్ గోరుటల్ మూఁటి నెం
చును గార్యవ్యసనంబులండ్రు నయవేదుల్ మేదినీమండలిన్ ॥

సీ॥ ఓర్పును గరుణయు నోర్పులేకుండుట
దాక్షిణ్యమును బ్రహారతయు భయముత్రు
డంబును సిగ్గు దుష్టత్వంబు దైన్యంబు
నతిధార్మికత్వ మహంకృతియును
దనజాతిఁ బుట్టిన జనులఁ గాదనుటయుఁ
జంపుటయు నుపేక్ష సలుపుటయును
బలువగు నెండకుఁ జలికిఁ దా నోర్వక
యుండుట వానకు నోర్వలేమి

గీ॥ యివియవేళలఁ జేసిన నెందుఁ గార్య
సిద్ధులకు నెల్ల విఘ్నముల్ సేయుచుండు
ననుచు నీతిరహస్యజ్ఞు లండ్రుగాన
వీని ననుచితవేళల విడువవలయు ॥ 28

### సప్తవిధ పక్ష లక్షణము

వ॥ మఱియు మైత్రులును, నిజులును, సంబంధులును, భృత్యులును, నాశ్రితులును, గృహీతులును, గార్యజులు ననెడు నేడు దెఱంగుల వార లే పక్షంబనం బరంగుచుండుదు రిట్టి పక్షంబనంగ సహాయు లనం బరగుచునుండు నిట్టి సహాయు లెట్టివారనిన. 29

సీ॥ తన తల్లిదండ్రుల యనుఁగుబంధులె మైత్రు,
లెనసిన ప్రాంతవారెల్ల నిజులు,
బరవి వియ్యంకులె సంబంధులగుచుండ్రు
భృతికిఁ గొల్చెడువారె భృత్యు లరయ
నాత్మరక్షణమున నాశ్రయించినవార
లాశ్రితు లుపచార మందియుండు
వారు గృహీతులు వసుధఁ గార్యార్థులై
యనువొందువారె కార్యజులు దలఁప
గీ॥ నిటుల నేడుదెఱఁగులౌ నిట్టివారి
పక్షము లటండ్రు ప్రాజ్ఞులై పరగువార
లిందు రాగాపరాగంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు॥ 30

వ॥ ఇట్టి సహాయు లనురాగిసహాయులు సద్వృత్తసహాయులు నన రెండు తెఱంగులై యుండుదు రందు ననురాగంబుగల సహాయు లెట్టివారనిన. 31

### అనురాగి సహాయలక్షణము

చం॥ అనిశముఁ జేరికొల్చి సుగుణావళిఁ గీర్తనచేసి నిందలన్
వినక తదర్థమై తనరు విశ్రుతయత్నము పల్కు శౌర్యముం
గని కనుపట్టు దోషములఁ గప్పుచు నుండుట యెందు నెంచఁగా
ననువగు నెయ్యముల్ గలుగునట్టి సహాయుని చిహ్నము లిమ్మహిన్॥

వ॥ సద్వృత్త సహాయుం డెట్టివాడనిన. 33

సద్వృత్త సహాయలక్షణము

చం॥ కులమున మించి మోహమునఁ గూడక ధైర్యమురేని విద్యలన్
బలమును సత్యముం గలిగి పాటిలు లోభము డించి బుద్ధిచే
నలయుచు మేలెఱింగి వినయంబు వహించినయట్టిమిత్రుఁడే
వెలన నుతింప మంచి తగువర్తనమొందిన వత్తిమై దగున్ ॥ 34

ఆత్మగుణముల నుద్యోగాదుల శ్రేష్ఠత

గీ॥ త్యాగ ముద్యోగమును ధీరతయును బుద్ధి
నిజము మర్యాద సిగ్గు నింద్రియజయంబుఁ
బ్రౌఢియును గౌరవం బనురాగ మొప్పు
బలము నన ముఖ్యగుణములు పార్థివునకు ॥ 35

శక్తిత్రయ స్వరూపము

సీ॥ సారమౌ నీతిప్రచారం బెఱుంగుట
జగతిలోపల మంత్రశక్తియందు
రాత్మసంపదతోడ నలరినబలము కో
శంబు నెంచఁగఁ బ్రభుశక్తియండ్రు
ఘనమైనయట్టి విక్రమమును బుద్ధియు
సత్త్వంబు నుత్సాహశక్తియండ్రు
నీతిమంతులుగాన నృపవరుం డెల్లచో
నిట్టి త్రిశక్తుల నెనయవలయు
గీ॥ నిట్టులు శక్తిత్రయంబుచే నెనసి యెపుడు
నేర్పుతోడుత వర్తింప నేరకున్న
మించు శత్రుల నెటుల జయించనేర్చుఁ
జెలఁగి సంపద నేరీతిఁ జెందనేర్చు ॥ 36

సీ॥ వ్యసనమందిన దైన్య మందకుండుటయును
ఘనమైన శౌర్యంబుఁ గలుగుటయును
దక్షతయును శీఘ్రతయు మహోత్సాహ సం
పదయండ్రు జగతిలోఁ బ్రాజ్ఞులెల్లఁ
బుట్టగాఁ బుట్టిన బుద్ధియు శాస్త్రంబు
చెలియుటకతమునఁ గలుగుబుద్ధి
పెద్దలసంగతిఁ బెనుపొందుబుద్ధియుఁ
గడు విచారింపఁగాఁ గలుగుబుద్ధి

తే॥ జ్ఞానరూపమంత్రిసంపద యనఁదగు
నిట్టి రీతులెల్ల నెఱుఁగనేర్చి
తనదు రిపులమీఁద దండు పోవఁగఁదగు
నీతి నెఱిఁగినట్టినృపవరుండు ॥ 37

ఉ॥ అల యుత్సాహము శౌర్య మందుటయుఁ గా
ర్యం బూనుటల్ సేయుటల్
బలువౌ నిల్కడ పౌరుషంబు ముదముం
బ్రాపించు టారోగ్య ముం
దలపెల్లన్ ఫలసిద్ధిచేఁ దగుటయున్
దైవానుకూల్యం బగున్
దెలివిన్ భూపతి యిట్టివేళల ధరి
త్రిం దండుపోవం దగున్ ॥ 38

కం॥ జనపతి తన భండారం
బనుపమగతి వెంటరా సహాయులచే
ననువొంది గెలుచుటకునై
చనఁదగు బలాదిహీనశత్రుపుమీఁదన్ ॥ 39

కం॥ ఈరీతి నీతియుతుఁడై
ఘోరరణపథమందు దండు పోయినయేనిన్
సారోదారతఁ బారా
వారావృతమైన ధరణివలయం బేలున్ ॥ 40

దండయాత్రాకాల దేశాదులు

చం॥ జలములు పుల్లుగల్గుతటి సామజపంక్తికి దండు పోఁదగున్
జలములు పుల్లు లేనితటి సైంధవరాజికి దండుపోఁదగున్
వెలువని బెట్ట వంచుఁ గసువెట్టియు లేక చెలంగ నామనిం
గలయఁగ సర్వసైన్యములు గైకొని భూపతి దండుపోఁదగున్ ॥

గీ॥ గూబ రాతిరిఁ గాకులఁ గొట్టి చంపు
గాకి పగలైన గూబల గడిమిఁ జించుఁ
గాన వేళ విచారించి కదలవలయుఁ
గాల మెఱుఁగుచుఁ గదలినఁ గలుగు జయము ॥ 42

ఆ॥వె॥ కుక్కచేత మొసలి చిక్కును దరియందుఁ
గుక్క మొసలిచేతఁ జిక్కు నీట
నటులఁ గానఁ దనకు ననువైన చో టొంది
చెలఁగు రాజు కార్యసిద్ధిఁ జెందు ॥ 43

సీ॥ సమములై దసుపట్టు చదురపునేలల
నశ్వముల్ మున్నుగా నరుగవలయు
మిట్టలు గుట్టలు గట్టులు నైనచో
నేనుఁగుల్ మున్నుగా నేఁగవలయుఁ
బొదలును ద్రోఁతలుఁ బొదలెడిచోటులఁ
గాలాళి మున్నుగాఁ గదలవలయు
జలములు లోఁతుగాఁ గలిగినచోటులఁ
దగిన యోడలమీఁద దాఁటవలయుఁ

గీ॥ బెదురములు మిట్ట గుంటలు జలముఁబోటులు
గలుగు నటుపంటి నేలల బలముడిందు
నందుచే ముందు పనఁడగు నందుచేతఁ
బోవఁదగు దండయాత్ర మహీవిభుండు ॥ 44

చం॥ జనపతి వానకాలమునఁ జాలఁగ మిట్టలమించు త్రోవలన్
బనుపడ వేసవిన్ సలిలమార్గమునం జన నొప్పు నెండఁ ద
క్కినయెడ మిశ్రభూములను గేవల దుర్ఘటమైన మార్గముల్
గనుగొని యాత్మసేనకు సుఖంబగు రీతుల దండుపోఁదగున్ ॥

కం॥ జలములు కడుఁ గలత్రోవన్
జలములు లేనట్టి త్రోవఁ జనక సుఖగతిన్
నెలవరులఁ గూడి చనఁదగు
గలయం గట్టియలఁ గసవు గలిగినత్రోవన్ ॥ 46

మ॥ తన చుట్టంబుల మూఁక రాకడలచే ధాన్యాదిక ప్రాప్తిచే
ననువై నీళ్ళఁ జెలంగి నమ్మికల లోనై యుండు తన్మార్గ భూ
జనముల్ గల్గినత్రోవఁ బోవఁదగు నెంచం దీనుఁడై భంగముం
గని వీఁకల్ చెడి వచ్చుత్రోవఁ జనఁగాఁ గాదెందు భూభర్తకున్॥

చం॥ తెలియక దూరమైన రిపుదేశము వేగిరపాటు మీఱఁగాఁ
జలమునఁ జొచ్చిపోవు దొర సంగరరంగమునందు వైరిభూ
తలపతి ఖడ్గధారల విదారితుఁడై బహు రక్తధారలం
గలగొని పొక్కియుక్కఱెడి గ్రక్కునమూరకె చిక్కిద్రుక్కఁడే॥

వ॥ ఇట్లపాయంబులఁ జెందని యుపాయంబులం బయనంబులు
గదలివచ్చి సైన్యంబులు విడియింపందగు నచట మఱియును. 49

చం॥ అరులకుఁ జాలరానియటు లాత్మబలంబుల నిల్పి రక్షణం
బరయుచు నీతిరీతిఁ దగి యాప్తులు శూరులునైన యోధులె

చ్చరికెలఁ జుట్టియుండఁగ నిశాసమయంబుల యోగనిద్రలం
బొరయుచు నుండఁగాఁ బెగును భూపతియెందును జాగరూకుఁడై ॥

ఉ॥ కలయఁగఁ జాలి రొప్పు కరిఘంటలగల్లు ఘణంఘణ ధ్వనుల్
మెలఁకువఁజెంది గుఱ్ఱముల మించిన హేషిత ధాంకృతిధ్వనుల్
నిలుకడఁగాంచు యోధతతి నిశ్చలవాక్య డిమండిమ ధ్వనుల్
నెలకొని వీనులంటఁ బతి నిద్దురనందును మేల్కొనై తగన్ ॥

క॥ ఏమరతిఁ బతి నప్పటప్పటి
కది యెప్పుఁడు మేలుకన్న యతఁడని పతి దా
సదయుఁడయి యాదరింపుచుఁ
బదిలంబని యెచ్చరించి పలుకఁగవలయున్ ॥ 52

వ॥ అంత. 53

దండయాత్రా సమయముల రాజవైఖరి

చ॥ తెలతెల వేగలేచి నరదేవశిఖామణి స్నాతతీర్థమై
కల కులదైవముం గొలిచి ఘమ్మను కస్తురి తావి తీవితోఁ
దళుకుదళుక్కున న్మెఱుఁగు దార్కొను రత్న విభూష ణాళితోఁ
గొలువున కచ్చుపొప్పు నిరుగోపులగట్టిన వారభామయున్ ॥

సీ॥ శ్రీమంతులై మించు సామంతు లొకవంక
సుచితమంత్రులు మంత్రు లొక్కవంక
హితచర్యులగు పురోహితవర్యు లొకవంక
నుదిత సత్త్వు లమాత్యు లొక్కవంక
ఫలదాయులై నట్టి దళవాయు లొకవంక
నుక్కు మిక్కిన శూరు లొక్కవంక
నధికారుల జయించు నధికారు లొకవంక
సుచిత మిత్రుల మిత్రు లొక్కవంక

గీ॥ నొక్కవంకఁ గళావతు లొక్కవంకఁ
జామరగ్రాహిణులు గూఢచరులు గొలువఁ
ఏసి ప్రతాపంబుఁ బాఠకజనము వొగడ
నిండువేడుకఁ గొలువున నుండవలయు ॥ 55

కం॥ ఆయెడ జగతీనాథుం
డాయతమతి మెఱయ మంత్రులుం బౌరులతోఁ
జేయఁదగు సట్టిపనులు సు
పాయంబులు నిశ్చయించి పతి గదలఁ దగున్ ॥ 56

చం॥ అలవున వేగముం గల హయంబులనెక్కి తనంత లేచి వా
రలు బలుకైదువుల్ నిజకరంబులఁ దాలిచి వెంటఁగొల్వఁ బ
జ్జల నవధాన మెచ్చరికె సామి యహోయని పూని సాహిణుల్
గొలువఁగఁ దేజినెక్కి నృపకుంజరుఁడంతట యాత్రపోఁదగున్॥

మ॥ తనయంతేసినృపాలశేఖరులు మైత్రిస్నేహసన్నాహముల్
దనరం దేరులనెక్కి యుక్కుపొడిరాలన్ గొల్వఁగా సాహిణుల్
వెనువెంటన్ జతనం బహోయనుచు సేవింపన్ గడున్మ్రొంచి చ
క్కని సామ్రాణిపఠాణినెక్కి కదలంగా నొప్పు రాజెయ్యెడన్॥

శా॥ రాజేంద్రుండు గజాశ్వసంఘములచర్యల్లగ్గొనంగా జనున్
గై జీతంబును గూట మేర్పఱచి వేడ్కం గావఁగాఁ జెల్వగున్
దేజం బాయితపాటునుం గడుఁ బ్రసిద్ధిం జెందియున్నట్టి బ
ల్తేజీలం గజపఙ్క్తిఁ జూడఁదగు హాళిన్ రేపులున్మాపులున్॥

సర్వావర్జనోపాయము

మ॥ సులభుండౌ పొడగాన్పుగల్గి దయచేఁ జూపట్టి మందస్మితం
బులఁ జెన్నొందిన పల్కుచేఁ దగఁ బ్రియంబుల్మాటికిన్ బల్కఁగ

వలయుం జీతముతంతె నెక్కుడుగ నిర్వక్రంబుగా నియ్యఁగా
వలయుం బ్రాణము లిత్తు రీ విహితమౌ వాక్యంబుచేతన్ భటుల్॥

చం॥ వసుల రథంబులందుఁ దురగంబులయందు వలయోడలందుఁ దా
సరుగఁగ నేర్చి వింట నెరయం జతురత్వముఁ జెంది కార్యముల్
నిరతము నభ్యసింపఁదగు నేర్పున నీగతి నభ్యసింప ను
ష్కరమగు కార్యమైనను సుఖంబునఁ జెందు నరేంద్రుఁడున్నతిన్॥

మ॥ కదు సన్నాహముగల్గుసేన లిరుపంక్తిం గొల్చు సన్నాహముం
బొదవుంగల్గు గజంబునెక్కి రిపులౌ భూపాలకుల్ వ్రేయ పెం
బడి నేతెంచిన మాతతో భటతతుల్ పైమాటుగానుండ ని
క్కడు నేర్పొందెడు మంచివాక్యముల పెక్కుర్తిఁ బోవందగున్

గీ॥ బుద్ధిచే గుణములచేతఁ బొందలు గూడి
చారజనములచే దూతజనముచేత
వైరిచర్యలు దెలిసి బోవలయు వారు
దేనిపతి యెంచను గన్నులు లేనివాఁడు॥ 63

చం॥ ఘనత వహించు శత్రు గడిఁగాచుదొరం దన మిత్రుఁ జేసితోఁ
జనునపు డించుకించుక యొసంగుచు నాశలు చాలఁ జూపియై
నను మఱి వేరమాడునెడ న్యాయముదప్పక వైరి భూపులం
బనుపడి పట్టుపెట్ట పరిపాలన మొప్పఁగ మెల్పఁగాఁదగున్॥

చం॥ అనుపగుదూతఁ బంపి తనయందినకార్యము సంధిచేతఁ జే
య్యన నొనరింపఁగావలయు న ట్లొనరించిన సంధిగానిచో
దనరుచుఁ గార్యభేదమగు దాన నభేధముజెంది వారిలోఁ
గినుకలు బుట్టుచుండు నది కేవలముం బతికిన్ శుభంబగున్॥

చం॥ అడవులయందు దుర్గములయందు వసించినవారిఁ ద్రోవలుం
గడ్డులను గాచువారల ఘనంబగుసాహముచేత నీగిచే

గడుఁ బనియించి మించి తన కైవసమై తగఁ జేసికొంచుఁ దా
విడువక శత్రుభూములకు వీటలె త్రోవలు చూపఁ జొచ్చుటన్ ॥

ఉ॥ కారణ మొందియైన మఱి కారణమేమియు లేకయైననున్
వైరులయొద్దివారు తనవద్దకు వచ్చిన నాత్మసేవకున్
వైరులఁ గొల్చియుండి తనవద్దకుఁ గ్రమ్మఱ వచ్చియున్న భా
త్రీరమునుండు వారలచరిత్రలు తెన్ను తెలుంగఁగాఁ దగున్ ॥ 67

గీ॥ వసులపై నెత్తుపతి మంత్రబలము చాలఁ
జెంది మున్నె విచారంబు సేయవలయు
బాహుబలమునకన్నను బలిమి మంత్ర
బలము దానసె యింద్రుండు గెలిచె రిపుల ॥ 68

కం॥ మేలగుమతిచే సిరికై
కాలంబునఁ జెందవలయుఁ గార్యం బెపుడున్
గాలం బెడలినకార్యము
వాలాయము వచ్చుఫల మవశ్యము చెఱచున్ ॥ 69

చం॥ అలఘుప్రభావముం గలిగి యుచితకార్యములందు దక్షతై
మెలఁగుచు మంత్రమార్గమున మెల్కువ చాలఁగఁ జెందియున్నతిం
జెలఁగెడు ధారుణీధవులచేష్టల సద్భుజదండమండలిన్
నిలుకడఁ జెంది యెల్లపుడు నిల్చును వైపకళల్ దరిత్రియున్ ॥

గీ॥ ఆమని చెలఁగుఁ గార్తికమందునైన
జ్యేష్ఠయును మూలకార్తెయుఁ జెందువేళ
నైన మఱి చైత్రమాసంబునందునైన
దండువెడలుట తగునండ్రు ధరణిపతికి ॥ 71

కం॥ ఈరీతిఁ బగఱమీఁదట
నారూఢిగ దండువెడలి యల నీతివిధిన్
ఘోరపటుఁడు వర్తించిన
వైరిసమూహముల గెలిచి వర్తిలునెంమున్ ॥ 72

స్కంధావార నివేశనప్రకరణము

కం॥ బలిమిం దనయరిపురిచెం
తలకుం జని విడియఁదగినతావున విడియన్
పలయును బాళెముదిగునే
ర్పులుగలిగిన రాజు శత్రుభూపతులధరన్ ॥ 73

॥ నాల్గువాకిళ్ళచే నలువొంది చౌకమై
ఘనమును కొంచెంబుఁగాక తనరి
యగడితలనుకోట నట్టళ్ళఁ జెలువొంది
విరుపులౌ వీధుల వినుతికెక్కి
యర్ధచంద్రునిరీతి నైనను మఱియును
జతురస్రమైయుండు సరణినైన
నిడివిగానైనను గడు వట్రువుగనైన
నాలోనఁ గల భూమియను వెలింగి

గీ॥ విమతుపురిచెంతఁ బాలెంబు విడియుచోట
మించు *నౌకయగారంబు నిర్మించవలయు
సాధువులు మెచ్చ నచట నెచ్చరికె లెచ్చ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 74

సీ॥ కోటలోఁ బలము దాకొన విడియింపుచోఁ
గోటకు జలమున్న చోటునకును
గలుగసనందున వీధి కొలగోల మాత్రంబు
విడిచి యచ్చట బైలుపడక నిండి

* నౌక్కయగారు.

కొనియుండి వాలమించినపార్శ్వములు గల్గి
రక్షితం బగుచును గక్షపుటము
పసుపున మూలలై యట సూర్యసోమవీ
థులు విరువులుగాఁగ నలరఁజేసి

గీ॥ వాస్తుశాస్త్రక్రమంబుల వైపు దెలిసి
విమతపురిచెంతఁ బాళెంబు విడియుచోట
నిట్లు బలముల విడియించ నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 75

కం॥ పాళెమునడుచక్కి మహా
మూలబలము చుట్టుఁగలిగి ముందఱ నడుమన్
మేలిమియగుభండారము
చాలఁగలుగ నగ రొనర్పఁ జను నెచ్చోటన్ ॥ 76

కం॥ ఇలతోఁడు నగరిచుట్టును
బలియించఁగవలయుఁ బ్రాఁతప్రజఁ గైజీత
మ్ములఁగూటము మిత్రబల
మ్ముల శత్రుబలంబు నడవిమూఁకను వరుసన్ ॥ 77

వ॥ తత్క్రమంబు. 78

సీ॥ నరనాథమణి తననగరికిఁ జుట్టును
మునుమున్నుగాఁ బ్రాఁతమూఁక నిల్పి
యాతరువాతఁ గైజీతంబు విడిపించి
యాకడఁ గూటపుమూఁక నిల్పి
యావల మిత్రసైన్యంబుల విడియించి
దానియవ్వల శత్రుసేన నిల్పి
యందున కవ్వల నడవిమూఁకల నిల్పి
యావల జీతంబు లంది కొల్చి

గీ॥ తొయిత౯ బసులకుపచ్చి యా_ప్తుఁడు గ్రామ
లనుచుఁ నొక్కాలు గలిగినయట్టి పేరు
కాంద్రు చుట్టును విడియింపఁగా పలయుసు
గ్రామము దప్పరి నీతివిక్రమము మెఱయు ॥ 79

రాజాధిరక్షణకై సైన్యాపసానము

ఆ॥వె॥ అధిపు నగరిచేరువందు నుండఁగఁదగు
నా_ప్తరక్షితంబు లగుచుఁ దనరి
పేరు గలిగినట్టి పెద్దయేసుంగులు
సధిక జవముగల్గునశ్వములును ॥ 80

కం॥ అంతఃపురపరిచారకు
లెంతయుఁ దమి విచ్చుఁగత్తి తేమఱక మహీ
కాంతుని గావఁగపలయుసు
సంతతమును జాలిరొప్పు సన్నాహనమునన్ ॥ 81

కం॥ మేటియగు నా_ప్తుఁ డెక్కిన
పోతేసుఁగు జవము కలిమిఁ బొలిచిన హయముఁ
బాటించి నగరివాకిటి
చోటనె యెపు డుండవలయు జోక చెలంగన్ ॥ 82

కం॥ దళవాయి మున్నుగాఁగల
బలమం దొక కొంత యేరుపడి యత్నముతో
వెలుపటఁ జుట్టును దిరుగఁగ
వలయును రేలందుఁ గడు నవారితశక్తిన్ ॥ 83

కం॥ వేగము బలమును గలిగిన
వేగులవా రెల్లవేళ విమతులచర్యల్
బాగుగఁ దెలియుచుఁ దా మతి
వేగమె రాఁబోవవలయు విభునకుఁ దెలుపన్ ॥ 84

చం॥ వళిపింప తాటిక్రొవ్విరులవండలు గట్టినతోరణంబులుం
బలుపగు దంచనంబులును దాణము లాదిగఁగల్గు యంత్రముల్
పినగిన పెక్కుముల్ గలుగు ద్వారము లాప్తులఁ గాపఁజేయుఁగా
వలయు నృపాలశేఖరుఁ డవారితపూరితకీర్తిసాంద్రుఁడై ॥ 85

జాగ్రదవస్థిత్యావశ్యకత

కం॥ పోవుచు వచ్చుచు వాకిటి
కావలివారలకు నెఱుకఁగా సకలజనుల్
పోవలయు వైరిదూతలు
భావిఘనసుమతినె యుండి పోవఁగ వలయున్ ॥ 86

గీ॥ రిత్తకోలాహలంబులు రిత్తహాస్య
ములును జూదంబులును బానములును మాని
సవరణల మించి యుత్సాహసహితు లగుచు
బలము లెవ్వేళఁ గనుగల్గి పరగవలయు ॥ 87

కం॥ తనకోటకు వెలుపలి దెసఁ
వనబలము చరించుభూమిఁ వడపక వైరుల్
మొనసి చరియించుభూములె
జనపతి చరియింపవలయుఁ జతురుం డగుచున్ ॥ 88

వ॥ అది యెట్లన్నను. 89

కంటకాదిభూమాషణము

కం॥ ఒక్కొక యెడఁబడు పాఁతర
లొక్కయెడన్ ముండ్లకంప లొకయెడ ముల్కుల్
మిక్కిలి గలిగించి రిపుల్
ద్రొక్కుడి చోళ్లల్లఁ జెఱుప దొరకొనవలయున్ ॥ 90

కం॥ తన బలములు మెలఁగుటకై
తనబడిపనివారిచేతఁ దరుపులు బుట్టన్
ఘనమగు మొద్దులు శిలలుఁగా
గనుపట్టకయుండ సమము గావింపఁదగున్ ॥ 91

వ॥ అందు నుత్తమమధ్యమాధమ భూములు వివరించెద. 92

ఉత్తమాది భూభేదములు

సీ॥ తనసమూఁకలకు నెంతయు మెల్గఁగావచ్చి
వైరిమూఁకలకు రావైపుగాని
దేశ ముత్తమమగు దేశంబు మఱియును
బగఱకుఁ దన కొక్కటిభంగియైన
దేశంబు మధ్యమదేశమై చెలువొందు
వైరిమూఁకలకు రావచ్చియుండి
తనమూఁకకెల్ల నెంతయుఁ బోవఁగారాని
దేశంబె యధమప్రదేశ మటులఁ

గీ॥ గనుక నుత్తమదేశంబె తనకు వలయు
నది దొరకకున్న మధ్యమమైన దైన
వలయు నదిగాక చెఱసాలవంటిదైన
యధమదేశంబు వలదు ధరాధిపతికి ॥ 93

వ॥ మఱియు నపజయసూచక ప్రకారంబు లెట్లన్నను. 94

నిమిత్తజ్ఞానప్రకరణము - అపజయసూచక నిమిత్తములు

సీ॥ గ్రహమునోఁకిన లీలఁ గళవళ మొందుట
తెవులుచేఁ బీడలఁ దవులుటయును
గారణంబులులేక కడుభీతి నొందుట
మంచును దుమ్మును మించుకొనుట

కడుధూమ్రమై దొడ్డగాలి పైకొనుటయు
సూరకె సెక్కెంబు లుర్విఁబడుట
తమలోనఁ దమకు ద్రోహములు గల్గుటయును
వాద్యముల్ రెస్పఁగా వాఁగమియును
గీ॥ మిగుల మదిలోన నూరక దిగులుపడుట
నేల యుఱుముట చుక్కలు రాలుటయును
దొంగలు మంటలు గత్తులఁ బొడముటయును
గలుగు పాళెంబు విజయంబు గానదంద్రు ॥ 95.

సీ॥ చాల దాపట నక్క లూలఁబెట్టుటయును
ఘనమైనతాపంబు గలుగుటయును
ప్రూఁకులపైనుండి మూఁకలుగా వచ్చి
కాకులు గ్రద్దలు గ్రమ్ముకొనుట
క్రమ్ముకో రాజనక్షత్రంబులందును
గ్రూరగ్రహంబులు గూడుటయును
గారణంబేమియుఁ గలుగక మద మింకి
యేనుఁగుల్ గదలక గ్రమ్మానుపడుట
గీ॥ తురగచయములు గదలక తొట్రుకొనుట
సూర్యనందను మొండెముల్ చూడఁబడుట
సెరసి నెత్తురువానలుఁ గురియుటయును
గలుగుపాళెంబు విజయంబుఁ గానదంద్రు ॥ 96
వ॥ మఱియును జయసూచకంబు లెట్లన్నను. 97

విజయసూచక నిమిత్తములు

సీ॥ తేజీలసకిలింత లోజమై చెలఁగుట
కాంతలుఁ బురుషులు సంతసిలుట
భేరీరవంబు గంభీరమై యుండుట
కరిబృంహితంబు లగ్గలము లగుట

పుణ్యాహమంత్రముల్ పొలుపు పఠించుట
పాటలు నాటలుఁ బ్రబలు టెంపు
ఈతిబాధలులేక యింపొంది యుండుట
సంతతోత్సాహముల్ సంఘటిలుట

గీ॥ సారె జనులెల్ల విజయంబు గోరుటయును
వాన లటుగల్గి ధూళిచే నూనకుంట
గ్రహము లనుకూలగతులను గాంచుటయును
గలుగుపాళెంబు విజయంబుఁ గను నటండ్రు॥ 98

సీ॥ మెల్లనితావులఁ జల్లగాడ్పులుగల్గి
సంతోషములఁ జెందు జనులుగల్గి
పక్షిజాతులమంచిపల్కులు వినఁగల్గి
చెలఁగుచునుండు మిత్రులునుగల్గి
వందిమాగధశుభవాక్యచాతురిగల్గి
వలఁగొనుశిఖల వహ్నులఁ జెలంగి
మదధారల నెసంగు మాతంగములుగల్గి
పలపట నక్కకూఁతలును గల్గి

ఆ॥వె॥ యలర నెందు దివిని నంతరిక్షమునందు
నవనితలమునందు నద్భుతముగ
నురక పొడముసట్టి యుత్పాతములులేక
వెలయుపాళెమునకుఁ గలుగుజయము॥ 99

కం॥ పాళెంబున కపశకునమె
చాలంగాఁ గలిగెనేని జయములు దొలఁగున్
పాళెమున మంచిశకునమె
చాలంగాఁ గల్గెనేని జయముల్ గలుగున్॥ 100

కం॥ ఇలలోపల శకునంబులె
దెలుపును జయ మపజయంబుఁ జేటపడంగా
నిలఁ దేఁ దటుగున శాస్త్రము
తెలివిన్ శకునంబులెల్లఁ దెలియఁగవలయున్ ॥ 101

కం॥ మును మున్ను మంచి శకునము
లనుపంగని విమలచిత్తుఁ డగుచుపురుషుఁడు పూ
నినకార్యము సఫలం బగు
ననుచుం బలుకుదురు ప్రాజ్ఞు లనవారెందున్ ॥ 102

కం॥ బలమును దైవబలంబును
నలప్రజ్ఞయు నిశ్చయంబు యత్నమును సహా
యులకలిమి నెట్టివానికి
గలుగున్ ధరనట్టివాఁడు కడు జయ మందున్ ॥ 103

గీ॥ పనవు దవసంబు నీళ్ళును గట్టియలును
జేకురకయుంట చుట్టముల్ రాకయుంట
రేలు బగలును లాచి కగ్గోలు వడుట,
విభుడులకు మృత్యువగు దీని విడువవలయు ॥ 10

కం॥ ఈరీతి దండు విడియుచు
సారె శుభాశుభము లిచ్ఛశకున స్థితులం
దారెఱుఁగవలయు నృపతులు
వైరులయశుభములు దెలియవలయున్ వరుసన్ ॥ 105

ఉపాయ వికల్ప ప్రకరణము

కం॥ ధృతి యుద్యోగము సత్త్వం
బతులితమతి దేవతాసహాయత గలభూ
పతి సప్తోపాయంబుల
గతు లెఱుఁగుచుఁ జూనువలయు గడిఁదిరిపులపైన్ ॥ 106

కం॥ చతురంగబలముకంటెను
బ్రతిభందగు మంత్రబలము భండారము ను
న్నతిమించుఁ గాన వీననె
యతులితగతి గెలువవలయు నహితుల నెల్లన్ ॥ 107

## సప్తవిధోపాయములు

కం॥ ఇలలోన సామదానం
బులు భేదము మఱియు దండమును మాయోపే
క్షలు నింద్రజాలమనఁగాఁ
గలిగిన యీయే డుపాయగతు లంద్రు బుధుల్ ॥ 108

వ॥ అదియెట్లన్నను తత్ప్రకారంబు గ్రమంబున వివరించెద. 109

## సామ స్వరూపము

సీ॥ మనసుపుగాఁ బ్రియమున మ్రొక్కి లోనద్భుత
పెద్దలసుగుణముల్ పేరుకొనుట
వారిసత్కర్మముల్ వరుసతో నెన్నుట
తొలుతటి సంబంధములు దెలుపుట
తనకుఁ జుట్టఱికంబుఁ దానె కల్పించుట
యిరువురయుపకార మెన్నికొనుట
యన్యోన్యగుణముల నంచందఁ బొగడుట
మీఁదటిఫలములఁ దాఁ దెలుపుట

గీ॥ మంచితనమునఁ గల్పుకోల్మాట లాడి
యేను నీవాఁడ నని తను నిచ్చికొనుట
యివియె సామప్రకారంబు లిట్టి వెల్ల
నెఱుకగలరాజు పేర్వెర నెఱుఁగ వలయు ॥ 110

## పంచవిధ సామప్రకారములు

వ॥ ఇట్టి సామప్రకారంబు లన్నియునుం గూడి యైదు విధంబులై
యుండు నది యెట్లన్నను పరస్పరోపకార ప్రదర్శనంబును, బర
స్పరగుణకీర్తనంబును, బరస్పర సంబంధకథనంబును, నుత్తమ
కాలఫలప్రదర్శనంబును, నేను నీవాఁడనని తను నిచ్చుకొనుట
యునుంగా, మఱియు నది ప్రయోగించు తెఱంగెట్లన్నను. 111

## సామప్రయోగవిధానము

గీ॥ ఎలమి నిరుపుర యుపకార మెంచి మించు
గుణముఁగొనియాడి సంబంధగణన సేసి
మీఁదటిఫలంబు గనఁబల్కి మీకు నేను
నగు లటనుచును సామోక్తిఁ బలుకవలయు ॥ 112

గీ॥ అరసి బహుమాన మొనరించు నట్టికరణి
నాదరంబునఁ గనుఁగొనునట్టి సరణి
నమృతకణములు చిలుకుచున్నట్లు నేర్పు
కులుకుచుండఁగ సామంబుఁ బలుకవలయు ॥ 113

కం॥ సామంబుగ నిజ మాడుట
ప్రేమం గొనియాడుటయును బ్రియ మాడుటయుం
దా మఱి ప్రార్థన సేయుట
యీమార్గము మనుజపతుల కెఱుఁగగవలయున్ ॥ 114

కం॥ నేమమునఁ గార్యసిద్ధికి
సామమె యొనరింప వలయు సకల మగునెడన్
సామమునఁ గార్య మగు నని
ధీమంతులు సంతతంబుఁ దెలిపెదుకతనన్ ॥ 115

కం॥ సురలసురులు మును సామ
స్ఫురణఁగా శరనిధి మథించి శుభ మొందిరిలన్
ద్వరితమున సామ మొల్లక
కురురాజకుమారు లవనిఁ గూలరె జడులై ॥ 116

వ॥ సామసాధ్యులకు. 117

సీ॥ అలసుని శౌర్యము దలఁగినవానిని
గడునుపాయంబులు చెడినవాని
క్షయముచే వ్యయముచేఁ బయనంబుచేతఁ దా
నెందు సంతాపంబుఁ జెందువాని
బపరంబులోపలఁ బాటిపోయినవాని
మూర్ఖుని భయమున మునుఁగువానిఁ
బడుచువానిని ధర్మపరుఁడైనవానిని
నతివలయందు మోందైన వాని

గీ॥ చెడుగువానిని నేస్తంబుచేయువాని
మంచిమతిగల్గువాని సాధించవలయు
మంచిమాటలచేత లాలించి యెల్ల
వారిఁ దనవారిగాఁ జేయవలయుఁ బతికి ॥ 118

కం॥ పలుతెఱఁగుల కార్యములకు
నిలలో సాధకములైన యిట్టియుపాయ
ముల్మలలో సామమె వేళలు
దెలియుచు నొనరింపవలయు ధీమంతులకున్ ॥ 119

వ॥ దాన ప్రకరణము. 120

సీ॥ అధికంబు మధ్యమం బల్పంబుగా ధన
మిచ్చినట్లనె మళ్ళ నిచ్చుటయును
పనసాహుమ్మలెవ్వియుఁ దానియ్యకయె మున్నె
కైకొన్న సమ్మతిఁగని యలరుట
యటుమత్తై మించినయట్టి పదార్థంబు
లింపు మీఱంగఁ దా నిచ్చుటయును
దా నప్పు లిచ్చిన ధనములు దక్కఁగా
నప్పుణబెట్టి తా నప్పగించు
గీ॥ టన్యులధనంబుఁ గైకొన నడరెనేని
యందులకు సమ్మతించి సహాయుఁడగుట
లిట్టు లైదువిధంబుల నెనయుదాన
రీతు లెఱుఁగంగవలయును నృపవరుండు ॥ 121

కం॥ భూనాథుఁడు లోభముగల
వానిన్ మఱి పేదయైనవాని నెఱుఁగుచున్
దానోపాయముచేతనె
తా నెంతయు వశులఁజేయఁ దగు నెచ్చోటన్ ॥ 122

కం॥ దానవగురుఁ డింద్రునిచే
దానంబున శాంతిఁజెందె ధర నటుగానన్
దానముననె కలహంబులు
మానుపఁగావలయు బుద్ధిమంతుల కెల్లన్ ॥ 123

కం॥ తనయాడుబిడ్డకును ద
ప్పానరించినఁ జూచి కోప మొదవిన శుక్రున్
మును వృషపర్వుఁడు దానం
బున మాన్పెం గాన నదియె ముఖ్యం బెందున్ ॥ 124

కం॥ కలహము మాన్పెడుకొఱకై
బలియున కీవలయుఁ బ్రియముఁ బల్కుచునైనా
నలదుర్యోధనుఁ డీయక
చలమునఁ గులమెల్లఁగూల్చి సమయఁడె తానుఁ ॥ 125

కం॥ జనపతి దానోపాయము
మునుగా సామంబు భేదమును గావింపం
జను దానముచేతను మిం
చినసామము భేద మర్థసిద్ధిం జేయుఁ ॥ 126

ఆ॥వె॥ తృణముపోలె నీవి నెసఁగనిసామంబు
గార్యసిద్ధిచేయఁగాన దెంచు
నీవి చూపఁడేని యిల్లాలు దనకైన
రిత్తమంచిమాట బత్తిగనునె ॥ 127

వ॥ భేదోపాయప్రకరణము. 128

కం॥ అనురాగంబును నెయ్యం
బును జెఱుచుట చాలఁగినుకఁ బుట్టించుట యిం
కెన చూపి తలఁక చేయుట
యన భేదము మూఁడుదెఱఁగులై చెలువొందుఁ ॥ 129

వ॥ భేదోపాయప్రయోగము. 130

కం॥ తనువాని కమ్ముకొనుగతిఁ
దననేర్పులు చాల మెఱసి తా హితచర్యం
దనరుచు నరి భేదింపం
జనుఁ జల్లనయైన పీళ్ళు శైలముఁబోలెఁ ॥ 131

కం॥ తమవారు శత్రుచే భే
దము నొందక యుండఁ జేసి తా శత్రుల భే
దముఁ జెందఁ జేయవలయుఁ
సమకొని తమపక్షమునకు శాంతి ఘటిల్లఁ ॥ 132

కం॥ జననాథుండు పురోహిత
జనులకు మంత్రుల నమాత్యజనులను యువరా
జును భేదింపం జను ని
ట్లనుచుఁగ భేదించెనేని యరి నెడు నెంచున్ ॥ 133

కం॥ జననాథునకు మంత్రియు
ననుఁగవ యువరాజమాత్యగణములు భుజముల్
గన వీరలయం దొకఁడై
నను భేదముఁ జెంద రిపుఁడు నాశముఁ జెందున్ ॥ 134

కం॥ మును బలుదెఱఁగుల నడకల
బెనుపొందినవై రిపులకు భేదింపంగాఁ
జను భేద మొంది యాతఁడు
తనవెలప్రను దానె చెఱుచు దావాగ్నిగతిన్ ॥ 135

కం॥ జనశత్రుని దాయాదియుఁ
జనశత్రుని జననిరియును దగ నము లిటు వీ
రిని భేదింపన్ వలయును
జనయంచును భేద మొందు తనలకయుండన్ ॥ 136

చం॥ ఘనపున మించి శత్రునెడఁ జాలఁగఁ గోపము రేఁచమాన్పనో
పినఁ జను భేదముం దెలిచి పెంపెనఁగం దెలియంగ నొప్పు స
జ్జనుఁడును దుర్జనుం డగుట సజ్జనుఁడైనను బూనుకార్యముల్
దనరఁగఁ జేయు దుర్జనుఁడు దా ధనరాంక్షలుఁ గూల్చు నిర్వరన్ ॥

చం॥ జనవిభుఁ డప్పుడించుక యొసంగుచు నాశలు చాలఁ జూపుచున్
దనరఁగ నిందు నందును ఘనంబుగ జీతముఁ జెందువారిచే
ననువునఁ జొచ్చినట్టిదెఱఁగులై తగు భేద్యుల నెల్ల భేదముం
గన నొనరింపఁగావలయుఁ గాలము దేశముఁ దా నెఱుంగుచున్ ॥

వ॥ ఇట్టినాలుగువెఱంగుల భేద్యులెట్టివా రన్నను పఘనిచేత జీతంబులు చెందని లుబ్ధుండును. నవమానంబు చెందిన యభిమానియు. వెఱపింపఁబడిన భీతుండును. గోపింపఁబడిన క్రుద్ధుండును. ననంబరగుచుండుదురు. తత్ప్రకారంబు క్రమంబున వివరించెద.

సీ॥ అనుపలఁ బెట్టింప నడుగుచుండెడువాఁడు
మిగులంగఁ బేదయై నొగులువాఁడు
పతిచేతఁ జెఱుపఁగాఁబడిన ధర్మంబును
గామంబు నర్థంబు గలుగువాఁడు
వెలుపట రొక్కంబు గలిగినవాఁడును
నధికభోగముఁ గోరునట్టి వాఁడు
వసుధ నెంచఁగ లుబ్ధవర్గమై దనరుదు
రిట్టివారల మార్గ మెల్ల నెఱిఁగి
గీ॥ యర్థములయందు మిగులఁగ నాశఁ గొల్పి
మఱియు నందుకుఁ దగినట్టి మాట లాడి
భేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 140

వ॥ అభిమాని ప్రకారంబు. 141

సీ॥ కలహంబుపైఁ గాంక్ష గలిగియుండెడువాఁడు
సాహసవృత్తి నెసంగువాఁడు
ధనముచేఁ గులముచేఁ దనకు సిద్దైనవాఁ
డెంచ లేఁడంచు గర్వించువాఁడు
పూజార్హుఁడై యుండి పూజనొందని వాఁడు
నేపాటిమాపైన నెడయువాఁడు
పరిగానివానితో పాటిచేసినఁ గోప
మంది సమర్థుఁడై నట్టివాఁడు

గీ॥ ఇసుభలో వీరి నభిమాని వర్గ మండ్రు
క్రమముతోడుత వీరిమార్గంబు తెలిసి
ఖేద మొందించపలయును బెంపుఁజూపి
సిరిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 142

వ॥ భీరువర్గ ప్రకారంబు. 143

సీ॥ పరితోడఁ గోపించి పగఁబెట్టుకొనువాఁడు
పిఱికిదసంబున బెగడువాఁడు
పరిచేతఁ గోపింపఁబడియుండువాఁ డెంపు
వతనిదాయాది యైనట్టివాఁడు
తా నేరములు సేసి తలఁకుచుండెడివాఁడు
గడుసగ్గి ప్రియమాడఁ బడినవాఁడు
వెలివేయఁగాఁబడి వెతలఁ జెందినవాఁడు
గణుతింప భీతవర్గం బటండ్రు

గీ॥ పిరిమార్గంబు తెలిసిగి వివేకి యగుచు
మఱియు నందుకుఁ దగినట్టిమాట లాడి
ఖేద మందించపలయును బెంపుఁ జూపి
సితిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 144

వ॥ క్రుద్ధవర్గ ప్రకారము.

సీ॥ ఇయ్యంగఁదగు నర్థ మియ్యక యెంతయుఁ
గాలంబు గడపఁగాఁ గడఁగునతఁడు
నవమాన మొందిన యభిమాని యగువాఁడు
లేనినిందలకు లోనైనవాఁడుఁ

*ాసుకత్తై యరికట్టఁగాఁ బడువాఁడుఁ
తన బంధువుల నొంపఁగినియువాఁడుఁ
గారణంబేమియుఁ గలుగక ధారుణీ
పతిచేత విడువఁగాఁ బడినవాఁడు

గీ॥ వసుధలో నెంచగాఁ గ్రుద్ధవర్గ మగుచు
రిట్టివారికిఁ గోపంబు తెచ్చుఁజేసి
భేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 146

సీ॥ ఆదాయమునకున్నై వ్యవహారమునఁగా
గెలిపింతు నని తానె పిలుపఁ బంచి
యోడించినను గోప మొందియుండెడు వాఁడు
పనితేనిపని యప్పపాటుచెంది
మనసులో నెంతయుఁ గినిసియుండెడువాఁడు
పనిగల్గి యరికట్టఁబడినవాఁడు
* (భార్యాధనములఁగోల్పడ్డవాడును నాత్మ
దోషంబుచేఁ గడుదుఃఖితుఁడును)

గీ॥ వసుధలో నెంచఁగాఁ గ్రుద్ధవర్గ మగుచు
రిట్టివారలఁ గోపంబు తెచ్చుఁజేసి
భేద మొసరింపఁగాఁదగుఁ బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 147

ఉ॥ ఈవరుసన్ విరోధియెడ నెంతయు భేదముఁబెంపఁజేసి తా
నావలవచ్చువారలకు నప్పుడ కోరిన వెల్లనిచ్చి సం
భావనసేయఁగా, వలయు మన్ననతోఁ దనయట్టివారలన్
భూవరుఁ డెందు భేదమునఁ బొందక యుండ నొనర్పఁగాఁదగున్

* (..........................)

## భేదోపాయములు

కం॥ ఇచ్చుట యాశలు చూపుట
మచ్చిక మాటాడుటయును మన్నించుటయున్
హెచ్చినభయంబు చూపుట
నిచ్చలు భేదంబుసేయునేర్పులు జగతిన్ ॥ 149

కం॥ మును భేదముఁ బొరయింపుచు
ననయురిపై సైన్యంబుమీఁద దండ మొనర్పన్
దను దానె విఱుఁగుచుండును
ఘనముగ నుసిపురువు దినినకట్టియపోలెన్ ॥ 150

కం॥ బలవంతులతోఁ గలహం
బలవడ భేదమున గెలువ నగుఁ జండామ
ర్కుల భేదపఱచి దివిజులు
గెలుపరె దానవుల నెల్ల క్షితి నుతియింపన్ ॥ 151

వ॥ దండోపాయ ప్రకరణము. 152

కం॥ అలమటఁబెట్టుట చంపుట
కలిగినధనమెల్ల నొడిచి కైకొనుటయుఁగా
నిల దండము మూఁడు దెఱం
గుల వెలయు నటంద్రు నీతికోవిదు లెల్లన్ ॥ 153

వ॥ అందు వధరూపంబగు దండంబు ప్రకాశంబు నప్రకాశంబన
రెండు దెఱంగులై యుండు నది యెట్లన్నను. 154

కం॥ జగతిని జారులు చోరులు
నగువారిని తనకు శత్రులగువారి మదిం
దగ నెఱిఁగి తాఁ బ్రకాశం
బగు దండ మొనర్పఁ జెల్లు నధిపతి కెందున్ ॥ 155

కం॥ జనుల వెఱపించు నతనిన్
జనులం బాధించునట్టిజనవరి నెంచన్
దను మించు శత్రుఁగూల్పఁగ
దనరుం దగ నప్రకాశదండముచేతన్ ॥ 156

గీ॥ విసము గలిపిన గంధంబు లొసఁగియైనఁ
బగినమారణకర్మమంత్రములనైన
విసముచేనైన నాయుధవితతినైన
నాజ్ఞసేయింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 157

చం॥ ధరపయి నప్రకాశమగుదండమునన్ వధియింపయోగ్యతా
పరులనుపేక్షనైన మఱిన్యాయము చంపఁగ నయ్యుపేక్షయం
దరయఁగఁదాని కట్టెదుట నప్పుడె పాయక గూఢవృత్తిచే
బరగ నొనర్పఁగాఁదగు నృపాలశిఖామణి నీతివెంపునన్ ॥ 158

చం॥ జముఁడును బోరి మించి తనచక్కటి కేరికిఁ జేరరాక ని
త్యముఁదనయాజ్ఞ కర్హు లగునట్టిజనంబుల నాజ్ఞసేయఁగా
నపరు నుపేక్షసేయునెడ తెందు నెఱుంగనివాఁడు పోలె భూ
రమణవరేణ్యుఁడుండఁదగు రాజితనీతివిచారచాతురిన్ ॥ 159

కం॥ ఇల జాతిమాత్రులగు వి
ప్రులయెడలన్ ధర్మబుద్ధి పొసఁగినకడన్
తుల [1](యెడ వధంబు దండము
కలిగింపక మే)లొనర్పఁగాఁ దగుఁ బతికిన్ ॥ 160

కం॥ యమతనయుఁడు బలెఁ బతి దే
శముఁ గాలంబును సహాయసంపద యుత్సా
హము [2](గల్గి దండమున నన
యము, రిపుబలమెల్లగూల్చు) టర్హము ధాత్రిన్ ॥ 161

1 (........................) 2 (........................)

కం॥ మండలనాథుల శక్తియు
మండై భృగుసరాముఁ డొకఁడె తుసమినగతి భూ
మండలిఁ గలిగినశత్రుల
మండిగ గెలువంగవలయు ధరణీపతికిన్ ॥ 162

వ॥ మటి యందును సామదానంబులచేతను, దానభేదంబులచేతను, భేద దండంబులచేత సాధనంబు క్రమంబున వివరించెద. 163

కం॥ నేడుపున నార్యులై తగు
వా రసమానమున దైవవశమునఁ దనతో
[1] (దూరముగ నెడసినను న
వ్వారిని సామమునఁ దనసు వశపఱచుకొనన్) ॥ 164

వ॥ అట్టియార్యు లెట్టివారనిన. 165

కం॥ కులశీల సత్యశౌచం
బులు దానము దయయు ధర్మమును మేలెఱుఁగన్
[2] (తలఁపున లోభం బనునవి
గలవారలె జగతి) నార్యగణము నుతింపన్ ॥ 166

కం॥ తనయనుజులో తనతనుజులు
తనబంధులు భేదమొంది తను నెడసినచో
దను సామదాన [3] (ముల సా
ధన ముచితం బట్టి యాప్తతము లెవ్వరికన్) ॥ 167

వ॥ తనయాజ్ఞగతియంతయుం గనుంగొని తమలోనఁ దీమెలంగుచు భేదంబును జెందిన దుష్టులగు [4] (వీరు సామాసాధ్యులు గాన దండంబునన సాధింపనగు.) 168

1 (............) 2 (............) 3 (............) 4 (............)

కం॥ సేనాపతులను బురిఁగల
మానవులను దనదుసీమ మనుమానవులం
దా నొనగూర్పఁగ వలయును
దానమునఁబు భేదమునను ధరణీశుఁ డిలన్ ॥ 169

చం॥ కలఁకలు బుట్టఁజేసి తిరుగంబడియుండుకులంబువారి చెం
తల గడిసుండురాజుల వనంబుల [1](సుండెడివారి భేదిపుం
జెలుపున దండవైఖరిని) చిక్కఁగఁజేయఁగ నొప్పునేలువుర్
బలియఁగ నన్యులం దగునుపాయముచేఁ బను పట్టుపెట్టఁగా ॥

వ॥ ఇది చతురుపాయస్వరూపంబగు నింక మాయోపేక్షేంద్రజాలంబుల
ప్రకారంబులు గ్రమంబున వివరించెద. 171

మాయాప్రకారములు

సీ॥ జనులు కంబములలోనను దేవతాప్రతి
మలలోపలను జొచ్చి మెలఁగుటయును
గాంతాదిరూపముల్ గైకొనుటయు రాత్రు
లందుఁజీఁకటుల మహాద్భుతముగఁ
గౌరవిదయ్యముల బాగున మించుటయును భే
తాళుని చందంబుఁదాల్చుటయును
బులుల నక్కల యెలుఁగుల రూప మొందుట
యివి మనుజులమాయ లెంచి చూడఁ

గీ॥ గామరూపంబుఁబూను టింగలము నంప
కోలలీను రాళ్ళ నీళ్ళను గురియుటయును
గాలి గట్లును మొగిలు చీకట్లు గలుగఁ
జేయుచుండుట దేవతామాయ యగును ॥ 172

1 [.................................]

గీ॥ పడఁతిరూపున మును సహ్యాబలునిఁ జంపె
పుహిని భీముండు మానవమాయచేత
నలుఁడు ప్రచ్ఛన్నరూపుఁడై కొలిచె దేవ
మాయఁగైకొని ఋతుపర్ణమనుజవిభుని ॥ 173

గీ॥ అవని నన్యాయమును ఘోరవ్యసనములును
నడరుచుండఁ బ్రవర్తించు నట్టివాని
నరసి మాన్పక యుండిన నగు నుపేక్ష
యిదియు మూఁడు దెఱంగులై యిటుల వెలయు ॥ 174

సీ॥ కామాంధుఁడై ముందు గానక గర్వించి
ద్రౌపదిపై కాంక్ష దనరుసింహ
బలుని భీముఁడు రేయి పట్టి వధింపుచో
విరటుఁ డుపేక్షించి విడుచుటయును
మునుపు హిడింబుఁ దా మోహించి భీముని
వరియించి యతనిపై వాంఛఁజేసి
తనతోడఁబుట్టిన దనుజు హిడింబుని
నురక యుపేక్షించి యుండుటయును

గీ॥ ననఁగ నీగతి నన్యాయమైన యెడల
వ్యసనములయెడ జగడంబు వచ్చునెడల
నగు నుపేక్షింపఁ దనవారినైన నెందు
నీతిమార్గం బెఱిగిననృపవరుండు ॥ 175

ఇంద్రజాలప్రకారము

సీ॥ ఘనముగా మాయచే గట్టులు చీఁకట్లు
పెనువాన లగ్నిఁగల్పించుటయును
దవ్వుల నున్నతధ్వజములు గలిగిన
సేనలఁ గన్పడఁ జేయుటయును

తునకలు మొండెముల్ తుండంబులై పడి
నొఱిగిన మూఁకలఁ జూపుటయును
నడరి సముద్రంబు లటుముంచుకై పడిఁ
బెల్లుఁగా వెల్లిఁ గల్పించుటయును

గీ॥ ననఁగఁగల యింద్రజాలంబు లద్భుతముగ
వైరిరాజులు భయ మందవలసి నేర్పుఁ
దనర నొనరించవలయు సువారలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 176

గీ॥ దైవమాయా విలాసంబు దడవు నిలుచు
నింద్రజాల విలాసంబు లెల్ల నపుడె
గానుపించును నామీఁదఁ గానరాక
పోవు నివి దెలియందగు భూమివిభుఁడు ॥ 177

ఉ॥ నీతివిధిజ్ఞుఁడైన ధరణీపతి యీగతి నీయుపాయముల్
చాతురితోడ శత్రువులసైన్యమునందును నాత్మసైన్యమం
దాతతరీతిఁ జేయఁదగు నాగతిగాక యుపాయతూష్యఁడై
యేతఱి నూరకున్నయెడ నెందును నంఘుఁడసంగఁ జేడ్పడున్॥

చం॥ అనలములోన నుండి తసరారుసువర్ణము బట్టికాఁచిసం
గొని బిగఁబట్టినందునకు గొబ్బున జారక చిక్కుమాడ్కి శ
త్రునియెడ నున్నసంపదయు రూఢిమెయిందగు నీయుపాయప
ర్తనమునఁబూనిభూవిభుఁడు దా బిగఁబట్టినఁజిక్కుఁ గ్రక్కునన్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభక్తినియుక్తమానసో
దారధరాధురావహనదక్షిణ దక్షిణబాహుదండవి
స్తారయశస్సరోవరలసన్నవనీరజకోరకాకృతి
స్ఫారసరోజజాండనయచారవిచక్షణ భద్రలక్షణా ॥ 180

కం॥ విమతహరణార్థయాత్రా
క్రమకౌశల విజయశకునగతినిర్ణయధా
గ్రిమలమతి సారపటువి
క్రమ సప్తోపాయచతుర ప్రఖ్యాతజయా ॥ 181

తోటకం॥ పటుధాప్రతిధాభరణాభరణా
చటువాక్చణసజ్జనతాభినుతా
ఘటితాంచితలక్షణలక్ష్యరసో
త్కట కావ్యకళాకరణాదరణా ॥ 182

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు యాత్రాభియోక్తృదర్శనప్రకారంబును, స్కంధావారనివేశనిమిత్త జ్ఞానంబును, సప్తోపాయ వికల్పంబును న్నది సప్తమాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## అష్టమాశ్వాసము

కం॥ శ్రీశ్రితమందిర రఘుపతి
విశ్రుతగుణవినుతిచతుర విపులరుచియశో
మిశ్రితలోక సుధీనిక
రాశ్రయ కొండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### సేనావివరము

ఆ॥వె॥ సామధానభేదసరణులు శాత్రవ
వరులయెడల నడపవలయు వరుస
నందుఁ జక్కఁగానియపుడు దండోపాయ
శక్తిఁ జూపవలయు జనవిభుండు ॥ 3

చం॥ తనకుఁ బ్రసన్నభావమునఁ దారకలుం గ్రహయుక్తిఁ బరింపుచో
వినయముతోడ దేవతల విప్రులఁ బూజలు సేసి సంతసం
బెనయఁగ నాఱు చందముల నెన్నికకెక్కు బలంబులం గ్రమం
బున నడపింపుచున్ గదలి పోఁదగు భూపతి శత్రుమీఁదటన్ ॥ 4

### షడ్విధబలప్రకారము

సీ॥ కైజీతమగు మూఁకకంటెను గల్మిలే
ములకు లోనగు ప్రాంతమూఁక మేలు
కూటంబుకంటె నెక్కుడు స్వామివశమైన
జీతంబుఁ జెందు కైజీతగాండ్రు

మిత్రసైన్యముకంటె మేలగుఁ దనసీమ
[illegible]ఖం బొందు కూటములమూఁక
శత్రుసైన్యముకంటె మిత్రసైన్యము మంచి
దేకార్థమతి నెయ్యమొనయుకతన

తె॥ గీ॥ మిగులఁ జెడుగు లగుచు మెలఁగి నిల్కడలేని
యడవిమూఁకకంటె నరయ మేలు
శత్రుసైన్య మిట్టిచందంబు బలముల
తారతమ్య మెఱుఁగఁ దగు విభుండు॥ 5

వ॥ అవి యెట్లనినను మఱియు విభునిచేత సత్కారంబులు చెందుట, యతనియం దనురాగంబు గలిగియుండుట, సహాలాపంబులు గలిగి ప్రవర్తించుట, బహుకాలంబుననుండి యతనితోడంగూడి వచ్చినభేదములకు సుఖదుఃఖంబులకు లోనైనవారగుటం జేసి ప్రాఁతవారలు కైజీతంబుమూఁకలకంటెను మేలు. ఆసన్నవర్తులై యుండుచుఁ జెప్పినపని జెప్పినట్ల సేయుచుండుకతనను తమ జీవనంబులు భూవిభునియధీనంబులగుటం జేసి కైజీతంపుమూఁక కూటపుమూఁక కంటెను మేలు. సమంబుగా సంతోష రోషంబులం జెందుట విభునకు సుఖంబుగలిగినం దామును సుఖవృత్తిఁజెందుట, యతనిదేశంబుననే నిచ్చలు మెలంగుటం జేసి కూటపుమూఁకలు మిత్రబలంబుకంటెను మేలు. సమంబుగా దేశకాలంబుల నొనఁగూడి వర్తించుట, యిరువురు నేకప్రయోజనంబున నాసక్తిమెలంగుట, పరస్పర స్నేహంబు గలుగుటం జేసి శత్రుబలంబుకంటె మిత్రబలంబు మేలు. స్వభావంబున ధర్మపరులై పరధనంబులయందె లోభంబుగలవారై దుర్జనులై మాటపట్టుఁదప్పెడివారలైన యడవిమూఁకలకంటెను దను గొల్చు శత్రుబలంబులె మే లిదియునుం గాక. 6

సీ॥ అరిబలంబులు మఱి యాటవికులు విభు
సీమఁ దా మెప్పుడు జెఱుతు మంచు
సదను గోటకయుండునట్టివారగుటను
దండయాత్రలు గల్గుతఱిని దెలిసి
తనవెంట వీరిఁ దోడ్కొని పోవఁగాఁదగు
నటులఁగాకున్న రాజ్యంబు నెల్ల
జెఱుపుచుండుదు రందుచే శత్రుపులరును
జయము నిశ్చయ మెట్టి సరవినైన

గీ॥ నదియుఁగానున్నచో భేదమైనఁ గలుగుఁ
గావునను దండయాత్రలు గదలు నపుడు
వారివెంటనె తోడుకపోవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 7

వ॥ ఇట్టి షడ్విధబలంబుల చందంబు తెఱింగి దండు గదలునప్పుడు
విభుండు దనవెంటనేతోడుకపోవువిధం బెట్లనినను తత్ప్రకారంబు
గ్రమంబున వివరించెద. 8

సీ॥ వ్యయమును దడపును క్షయమును గలయాత్ర
తనమూలబలముతోఁ జనగవలయుఁ
దడవును నాశంబుఁ దగులనియదియైనఁ
గైజీతములతోడఁ గదలవలయు
నరిమూఁక కడుఁగొంచెమై తడ వందని
యెడఁ గూటములతోడ నెత్తవలయుఁ
దనకులోనై ఫలం బొనగూర్చుమిత్రుతో
సమకార్యములయందె చనఁగవలయు

గీ॥ దుర్గములచెంతఁ గంటకాదులకు నెదుర
శత్రుబలములు మున్నుగాఁ జనగవలయు

పరులభూములఁ జొచ్చుచో నడవులందు
నాటవికసేనతోఁ జన నర్హ మంత్రు ॥ 9

వ॥ ప్రాంతపమూఁకలకు. 10

సీ॥ కడుచేవ యనురక్తి గలిగిన ప్రాంతమూఁ
కలఁజెంది శత్రుండు బలిసి యున్న
నతనికి సమబలంబై యుండునట్లుగా
క్షయము వ్యయంబును జాల నోర్చు
ప్రాంతపమూఁకలఁగూడి పైనెత్తఁగాఁ దగుఁ
గడుదూరమగుఁ ద్రోవగలదియైన
తడపుపట్టెడు నట్టిదండైనఁ దనచేత
బహుమాన మొందినప్రాంతమూఁక

గీ॥ లిలఁ గడలజెంది యాజికి నిలుచుఁగాన
ప్రాంతపమూఁకలె ఘనమైనబలముతోడ
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 11

సీ॥ తడపు వట్టెడునట్టి దండైన మిగులంగ
దండఁగల్గినయట్టిదండునందు
బలములు బహువిధంబుల నుండు కతమున
వ్యయము క్షయం బోర్వనట్టి కతన
గమనప్రయాసము గల్గినకతమునఁ
దనప్రాంతమూఁకలు దక్క నితర
బలములయం దెల్లఁ గలుగును భేదంబు
లటుగాన నిట్టిచో నన్యమైన

గీ॥ బలము నమ్మక నమ్మిక గలిగి కలిసి
బలిసి వర్తించు ప్రాంతమూఁకలనె కూడి

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 12

సీ॥ కదనంబులకు నోర్చు కైజీతమగుమూఁక
ఘనముగాఁ దనకును గలిగెనేని
తనప్రాఁత మూఁక లెంతయుఁ గొంచెమై బలిమి
కొనఁగూడఁగా లేక యుండెనేని
పగతు మూలబలంబు మిగులంగఁ గొంచెమై
చేవయు బలిమియుఁ జెందరేని
యతనిచేఁ గైజీత మందెడి మూఁకయు
నల్పమై యనురాగ మందెనేని

గీ॥ చాలఁ గల్గియు నని సేయఁ జాలదేని
యపుడు కైజీతమొందు సైన్యంబుఁగూడి
వైరి మీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రా విధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 13

సీ॥ తడఁబడవంచక కనుపట్టు దండైన
నరయ దూరముగాని యట్టిదైన
నెవ్వేళ నమ్మిక నెనసి చేకూడుచుఁ
దనమూఁక భేదంబుఁ గనకయున్న
నసమర్థభావంబు నందుచు నరిరాజు
దన కెందు లోకువై దనరియున్న
నప్రయాసమున మంత్రాజులచే గెల్వ
దనకుఁ గల్గెడు లీలఁ దనరియున్న

గీ॥ క్షయము వ్యయమును మిగులంగఁ గలుగదేని
యపుడు కైజీతమైన సైన్యంబుతోడ

వైరిమూఁకల దండెత్త వలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 14

వ॥ కూటపుమూఁకలకు. 15

సీ॥ కడు నధికంబుగాఁ గలిగిన యదియైనఁ
దనవెంటఁ దొడుకపో నొనరనేని
చెలఁగుచు బడలికల్ చెందని యదియైన
బహుముఖంబులుగాక పరగియున్న
చేరువదండైన చేకొద్దియై కార్య
సుప్రయాసంబున నగుచునున్న
శత్రుఁడు కొంచెపుసైన్యంబుతో నున్న
నేమరుపాటున నెసఁగియున్న

గీ॥ నెట్టిచోటున మోసంబు నెనయకుండు
జాడఁ గూటపు మూఁకలతోడఁగూడి
వైరిమూఁకల దండెత్త వలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 16

వ॥ మిత్రసైన్యమునకు 17

సీ॥ తనమిత్రసైన్యంబు ఘనమైనయదియైన
ననికిఁ దెచ్చుటకుఁ దా నర్హమైనఁ
దడవుగాకుండెడి దండైనమాత్రంబు
వలననే దాడియుఁ గలఘాములును
దఱచుగా గలుగక తనకుఁ జేకూడిన
కార్యంబు సమమైనఁ గలుగు ఫలము
మిత్రునధీనమై మెఱసి చేరెడిదైన
నరిసీమ చెఱిచెడు నట్టిదైనఁ

గీ॥ బగఱచేతను గానుకల్ పట్టి మనుడు
నట్టిదైనను మిత్రసైన్యంబుఁ గూడి
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 18

సీ॥ కుక్కక్రొవ్వునుఁ బందిక్రొవ్వుఁ గోరెడు బోయ
వెసఁగుక్కఁ బందిపై విడిచినట్లు
తనుఁగొల్వవచ్చు శాత్రవులసైన్యంబులఁ
బగవారిపైఁ దోరఁ బంపవలయు
నదిగాక వారు బాహ్యంబైన కోపంబు
నేసినచోఁ దనచేరువలనె
నిలుపఁగాఁ దగుఁ జెంత నిలిచిన నాంతర
కోపంబు బుట్టింప గుట్టు దెలిసి

తే॥ యపుడు గనుమలలోపల నడవులందు
గలుగునల కంటకాదుల గదుమఁ బనిచి
వారిచేతనె నొప్పించవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 19

కం॥ కనుమలఁ గంటకతతులం
బనివడి శోధించునపుడు బరసీమలకుం
జనునప్పు డడవిమూఁకను
దనసేనకు మునుపె పనుపఁ దగు జనపతికిన్ ॥ 20

వ॥ ఇట్లు చెప్పిన షడ్విధబలంబులును రథగజతురగ పదాతులతోఁడం గూడఁ బ్రత్యేకంబులుగాఁ జతురంగబలంబు లగుచునుండు. కలసన్నాహంబుల నిదియ కోశమంత్రంబులతోడంగూడి షడంగంబు లనం బరగుచునుండు. నిట్టిబలంబుల చందంబు

ఎన్నియు మనంబున నిశ్చయింపుచు వైరియోధతతికిం దగినట్లు ప్రతివ్యూహంబులు గల్పించు విజిగీషువైనరాజు దండయాత్ర గావలందగు నందు. 21

కం॥ బలముల సేనాపతియును
తెలు వలరఁగఁ జేయుపనులు జేయని పనులుం
దెలియం దగు వారలకుం
గల సన్నాహంబు లెఱుఁగఁగాఁ దగుఁ బతికిన్ ॥ 22

వ॥ దళవాయికి. 23

సేనాపతి ప్రభావము

సీ॥ కులజుఁడై తనసీమ నెళవరియై తగి
మంత్రిసమ్మతుఁడునై మంత్ర మెఱిఁగి
దండనీతి యొకింతఁ దప్పక యుండంగఁ
జదివి ప్రయోగించుచంద మెఱిఁగి
నిజము సత్త్వము నోర్పు నిలుకడయును గల్గి
మాధుర్యగుణగణమహిమఁ జెంది,
తనరుప్రభావ ముత్సాహసంపదఁగల్గి
తనుగొల్చువారి కాధార మగుచు
గీ॥ నెందు నధికుల మిత్రుల పొందుఁ గల్గి
చాల దాయాదులును బంధుజనులు గల్గి
యన్నివ్యవహారములు నేర్చి యెన్నఁగలుగు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 24

సీ॥ రాజ్యాంగములకుఁ బురంబువారలకును
సమ్మతుండై మించి చాలఁ జదివి
కారణంబులు లేని కలహంబులకుఁ బోక
కలఁగక శుభకర్మకలితుఁ డగుచు

నెందును మోసంబుఁ జెందక శూరుఁడై
వ్యాధులఁ బొరయక త్యాగియగుచు
కడుమంచిపనిఁబూనఁ గలిగి కాల మెఱింగి
సజ్జను లెల్లను జాల మెచ్చ

గీ॥ విక్రమముచేత నెంతయు వినుతికెక్కి
బడలికల గెల్చి తేరుల భద్రకరుల
నశ్వముల నెక్కనేర్పుల నలరి మించు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 25

సీ॥ మల్లయుద్ధములందు మఱికైదువులఁజేయు
జగడంబులందును జడుపు లేక
కడువేగదాఁటి పైఁబడెడు పీఁక లెఱింగి
బవరంపునేల లేర్పఱుప నేర్చి
సింహవిక్రమమునఁ జెలఁగి యాలస్యంపుఁ
బనివాఁడుఁగాక కోపంబుఁగలిగి
జాడ్యంబు నొందక చాల నుద్ధతి లేక
యెపుడు జనాంతరం బెఱుఁగ నేర్చి

గీ॥ కరితురగరథచయములఁ గైదువులను
గలుగు లక్షణములు లెస్సఁగా నెఱింగి
చక్కదనమునఁ జెలువొందు చతురుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 26

సీ॥ మేలెఱుంగఁగ నేర్చి చాలంగ దయఁగల్గి
నేర్పరులను గూడి నేర్పుఁ జెంది
జోదుల ధరియించు జోక లెల్ల నెఱింగి
యన్ని యుద్ధమ్ముల యును వెఱింగి

జగడంపు సవరణచందంబు లెఱుఁగుచుఁ
గరులచిత్తంబులు నరులమనసు
హయములహృదయంబు లనువొంద నెఱుఁగుచు
వానిగుర్తులఁ బేరువరుస నెఱిఁగి

గీ॥ వానిబనిగొను నేర్పులు దా నెఱింగి
సకలదేశస్వభావముల్ సకలరిపులు
సకలభాషల నెఱుఁగుచు సరసుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 27

సీ॥ మఱపును వెఱపును మది నెఱుంగక రేయిఁ
జరియింపఁగా నేర్చి శకునగతుల
సరవులు దెలిసి నక్షత్రగ్రహంబుల
యస్తమయం బుదయంబు నెఱిఁగి
దిక్కులు దేశముల్ దెఱువులు నెఱుఁగుచు
వాని నెఱింగిన వారి నేలి
యధికశథయార్తుల కథయంబు లిచ్చి
గాలికి వాన కాఁకలికి నోర్చి

గీ॥ దప్పిదగలకు నెండకుఁ దాళఁగలిగి
మిగుల దూరంబు పయనముల్ మెలఁగ నొప్పి
పరులమూఁకలఁ జీకాకు పఱుప నేర్చు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 28

సీ॥ కడు నసాధ్యంబులై కనుపట్టు పనులైన
సాధించునేర్పు నిశ్చయముఁగల్గి
తనమూఁక విఱిగిన నవికి విల్వఁగ నేర్చి
గగ్గోలు జగడంబుగతు లెఱింగి

బలములు గావించు పను లెఱుంగఁగ నేర్చి
పరుల దూతలచర్య లరయ నేర్చి
ఘనమైనయుద్యోగ మొసరించి వేగమె
యందు ఫలంబులఁ జెంద నేర్చి
గీ॥ పట్టి యీడేర్చుకొనునట్టి పనులు గల్గి
యటుల మెలఁగెడువారల సరసి నిలిపి
పరిభవంబైనయెడఁ గ్లేశపడక యుండు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి॥ 29

ఆ॥వె॥ ఇట్టి లక్షణముల నెంతయుఁ జెలువొంది
పతిహితంబునందె భక్తి గల్గి
చెలఁగు సంపదలను జేకూర్చు ఘను దళ
వాయిఁ జేయ మెలపపలయుఁ బతికి॥ 30

చం॥ ఎడయక రాత్రులుం బవలు నెచ్చరికందళవాయి యెఱులం
పడపులఁ గొండలం గడు భయంకరమైతగు దుర్గసీమలఁ
ల్లడపడకుండునట్లుగ బలంబుల వ్యూహమొనర్చి తాని యె
క్కుడుబతనంబునన్ మెలఁగి చూడుచు నేసలఁగాపఁగాఁదగున్

ప్రయాణ వ్యసనరక్షణ ప్రకరణము

సీ॥ మేటియౌనొకదొర మిక్కిలి శౌర్యంబు
గలమూఁకతో ముస్నుఁగదలవలయు
రమణీసమూహంబు రాజుభండారంబు
చదలంబునడుముగాఁ జనగవలయు
వానికి రెండుపార్శ్వములందు హయములు
హయములపజ్జల నరదములును
వానిపార్శ్వంబుల నేనుగుల్ వానిపా
ర్శ్వంబుల గదియంగ పదఖలంబు

గీ॥ అరుగవలయును వీరల కన్నిటికిని
వెనుక చెళవాయి బడలినజనముఁ దేర్చి
కొనుచు నాయత్తపాటుతోఁ జనఁగఁ జేయ
వలయు దండెత్తునట్టి భూపల్లభుండు ॥ 32

సీ॥ భయము ముందర గల్గఁ బటుమకరవ్యూహ
మునసైన జెక్కలు దసర విచ్చి
చిహ మించునట్టి గృధ్రవ్యూహమునసైన
వీరముఖంబైన తీరుబడిన
సూచికావ్యూహంబు సూటిచేసైనను
బలముల నడిపింప వలయుఁ దెలిసి
భయము పిఱుందనౌ పట్టున శకటరూ
పంబునమఱి పార్శ్వభయములందు

గీ॥ సలరు వజ్రాయుధమురీతి నన్నిదిశల
భయము గల్గిన సర్వతోభద్రరీతి
బలము వ్యూహంబుగాఁ బన్ని బలవిభుండు
నడుపగాఁ జేయవలయు యత్నంబుతోడ ॥ 33

వ॥ బలప్రయాణ వ్యసనములకు. 34

సీ॥ గుహలందు నెఱులందుఁ గొండల నదిత్రోవ
నడవుల నిఱుకటమైన యెడల
బడలిన నాకొన్నఁ గడు దప్పిఁజెందినఁ
గఱవుచేఁ దెవులుచేఁ గలిగియున్న
దొంగలు మారియుఁ దోలుక తిరిగిన
నడుసు నీళ్ళును ధూళి యలముకొనినఁ
జెదరిన సందడిఁ జెందిన నిద్దుర
నందినయెడఁ గూడి హాళినున్న

గీ॥ కొంచెమైనను సవరణ గూడకున్న
గాలివానల నగ్నులఁదూలియున్నఁ
చనదు సైన్యంబు రక్షించుకొనఁగవలయు
శత్రుసైన్యంబు లటులున్న జడుపవలయు ॥ 35

గీ॥ దేశకాలవిశేషముల్ దెలిసి యరుల
బలము భేదంబు నందించి బలసి చెలఁగు
బలియునకుఁ గూటయుద్ధంబు గలుగదేవి
యేయెడఁ బ్రకాశయుద్ధంబు చేయవలయు ॥ 36

కం॥ అడవులు గనుమలు మొదలగుఁ
గడు నిఱుకటమైనచోట్లఁ గళవళపడుచుం
డెడి శత్రుఁ దునుమ వలయును
విడువక గగ్గోలువడెడి వేళలయందుఙా ॥ 37

కూటయుద్ధ ప్రకారము

సీ॥ అహితుండు పోట్లాడ ననువైనచోటుఁ దాఁ
గైకొని యచ్చోటఁ గదలకున్న
నతనిమంత్రులు మొదలయిన వారల భేద
మొందించి యచ్చోట నునికిఁ జెఱచి
యైన నాటవికసైన్యంబు పేరిటిత్రాళ్ళ
చేఁ జుట్టి పోరికిఁ జెదరఁదీసి
తనమూఁక విఱిగిన యనువున నలయించు
కొనివచ్చి యొక యిఱుకునకుఁ దెచ్చి
గీ॥ వలనెఱుఁగు వీరభటులకు సెలవుఁ బెట్టి
చేరి చుట్టుక జగడంబు చేసిధైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 38

సీ॥ జనపతిముందరఁ గనుపట్టుగా నిల్చి
తన కెదు రెక్కుశాత్రవునిమీఁద
వెనుకచక్కికి మేటివీరయోధుల నంపి
పొడిపించి స్రుక్కించి కెడపిగ్గయెనఁ
గాక పిఱిందిభాగంబున మొనసూపి
ముందర నలయించి మొత్తియైన
సిరటి ప్రక్కఁ దా నెదిరించి శూరుల
నవ్వలి ప్రక్కది క్కంపియైన

గీ॥ నటుల నవ్వలిపార్శ్వంబులందు మొనపి
యివ్వలికి శూరతతి నంపి యెంచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 39

సీ॥ మునుచక్కి విషమమై మొనుపరాకుండిన
వెనుకటిదిక్కునఁ జెనకియైన
వెనుచక్కి మునుచక్కి మొనుపరాకుండినఁ
దొడరి ప్రక్కలఁజేరి పొడచియైన
నదిగాక మఱి తన యడవిమూఁకల శత్రు
బలముల దూష్యులఁ బనిచి మొదట
జగడంబు చేయించి మిగులఁ దా బడలించి
సన్నమై కూఁతలు సడలియున్న

గీ॥ వైరితతిమీఁదఁ బడుచును వాహనములు
గలఁగఁ దనరౌతులను బంపి కడిమియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 40

సీ॥ మూష్యల సరిమూఁకఁ దొలుదొ_త్త నళికించి
విఱిగి రా నళికించి విఱిగి రనుచు
విశ్వాసమునఁ జెంది విమతు సేపరినచోఁ
ఎనటు బల్మి చెలంగఁ దరిమియైనఁ
దాడింబు డిగఁపచోటఁ బట్టణంబులచోటఁ
బై_టల నూళ్ళను బ్రజలయందు
గొల్లకాసులుచూపి గొల్లలు చాలఁగాఁ
బట్టినచోఁ జుట్టు ముట్టియైన

గీ॥ పేఁటలాడంగ నడవికి వెడలి బడలి
యుండుతఱిఁ జుట్టు ముట్టి చెండియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥

సీ॥ మునుపుగా నొకకొద్ది మూఁకల మొనసేసె
కడు గట్టి మూఁకలకడను దాఁచ
సరిమూఁక సరకుసేయక మీఱి గర్వించి
తనమూఁకపైఁ బేర్చి యని యొనర్చు
మునుపు తాదాఁచిన మూకఁ చే శత్రులఁ
జేరి చుట్టుక నొంపఁజేసి యైన
నదిగాక పగవారి యావులఁ బట్టించి
వార లందుకుఁగూయవచ్చుచోట

గీ॥ నడుమ తెరువున నరికట్టి నడికియుండి
కడిమిమై చుట్టుముట్టుక పొడిచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రులఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥

॥ నగ్గోటుచే భీతిగలిగి రాత్రులయందు
నిద్రఁగానక పగల్ నిద్రఁ జెంది
యలసి యేమఱినచో నదరిపాటుననైనఁ
బగ లెల్ల నాయత్తపాటు చెంది
బడలినచోట మాపటిజామునందైన
నపురేయిఁగడు నిద్ర దొడరువేళ
రేతిరిజగరంబు రీతి దానెఱుఁగుచుఁ
బలుజోళ్ళు కొమ్ముకత్తులును గల్గి

తే॥ రపులచేనైన వేగంబు గలిగినట్టి
హారతతిచేతనైనను జుట్టుముట్టి
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 43

సీ॥ ఎండకుగాలికి నెదురెక్కి కనుమోడ్చి
సుడిపడి తడఁబడుచోటనైన
పడిగాక క్షుద్రంబు లగునట్టియడవుల
మంచున మబ్బుల మలలఁ బొదల
వాఁగుల వ్రంతలఁ దీఁగెల గుంతల
జాల నేఱులను బోరానియిఱుకు
తెరవుల నరికట్టి తిరుగువారుచునైన
మిగులఁ దా నచ్ఛిద్రుఁ డగుచు మించి

గీ॥ యదనుఁ జేకొని పైఁబడి చదిపి యైనఁ
బదరి తనమూఁక బడలిక పడఁగనీక
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 44

గీ॥ ప్రాణములయందుఁ గడు నాసపాటు లేక
విఱిగిఁ లజ్జించి తిరిగిన వీరవరుడు
మొక్కలంబునఁ బైఁబడి మొత్తఁగాన
మిగులవిఱిగినఁ జయమగాఁ దగదు పతికి ॥ 45

గీ॥ ఇటులఁ గపటంబు జగడంబు లెఱిగెనేని
గడు ననాయాసమున గెల్వ గల్గుచుండుఁ
గాన భూమీశుఁడగువాఁడు గపటయుద్ధ
సరణిచేతనే శత్రులఁ జదుపవలయు ॥ 46

వ॥ క్షయస్థాన వృద్ధులకు. 47

కం॥ వెచ్చము నాయము సమమై
వచ్చిన స్థానంబు మఱియు వ్యయ మధికంబై
వచ్చిన క్షయ మం దాయమె
హెచ్చిన నది వృద్ధి దీని నెఱుఁగఁగ వలయున్ ॥ 48

మ॥ దొరయుత్సాహము గల్గి మోసగతులెందుం జెందఁగా నీక యే
సరణిన్ వైరుల గెల్చునట్లు రిపులన్ సాధించు నన్ శంకఁ దా
నిరతంబున్ మది నిల్పి చారతతిచే నేర్పుల్ వగన్ శత్రులం
దరయంగాఁదగు సర్వకార్యములు నూహాపోహసన్నాహియై॥ 49

ఉ॥ మోసపుపోరిచే రిపులమూఁక నవశ్యము నొంచఁగా నగున్
వేసటలేకయుండుపృథివీపతి యీగతి శత్రు గెల్చుటల్
దోసముగాదు మున్నిటుల ద్రోణసుతుండును ద్రౌపదేయులం
బ్రాసముఁ బూని యేమఱినపట్టున నొంచఁడె నిద్రవేళలన్ ॥ 50

చతురంగబల ప్రయోజన ప్రకారము-గజకర్మ

సీ॥ పంపుయాత్రలను ముందరఁగాఁగ నడచుట
పనదుర్గములు చొచ్చి చనుట మఱియుఁ
దెఱువులు లేనిచోఁ దెఱువులు పెట్టుట
కొలఁకుల నదుల లోఁతులును దెలిసి
బలసమూహంబుల జలముఁ దాటించుట
యసహాయగతి జయ మందుటయును
దూరరాని మూఁకలఁ జొచ్చి భేదించుట
పేర్చి వేఁగినమూఁకఁ గూర్చికొనుట

గీ॥ పొడవుల వెఱపుచూపుట పొడవులైన
కోటలును గోటవాకిళ్ళు గూల్చుటయును
దాల భండారములు మోవఁ జాలుటయును
భయము దీర్చుట గజముల పను లటండ్రు ॥ 51

రథకర్మ

కం॥ తనసేనల రక్షించుట
యనిఁ జెదరినఁ గూర్చికొనుట యరిసేనలు దా
కొనియుండిన భేదించుట
యును నరికట్టుటయు రథము లొనరించుపనుల్ ॥ 52

అశ్వకర్మ

సీ॥ కొండలదండ దిక్కుల మార్గములయందు
విమతులమూఁకల వెదకుటయును
ధాన్యాదులను మిత్రతతుల రాఁ జేయుట
వేగంపుఁబనులు గావించుటయును

ఉపల వెంటాడుట తిరుగుచో విఱుగుట
విఱిగియుఁ గ్రమ్మఱ వెంటఁబడుట
ముందుచక్కి నడుచక్కి వెనుచక్కిఁ బ్రక్కల
పొదివి పొంకమెఱింగి పొడుచుటయును

గీ॥ వైరి యశ్వాళిపై మీఱి పోర జొరఁగి
పోయి పాళెంబుపైఁబడి పొడుచుటయును
గీసు లనపవారిఁ దోడ్కొని తెచ్చుటయును
దాడివెడలుట గుఱ్ఱపుదళముపనులు ॥ 50

పదాతికర్మ

సీ॥ ఎప్పుడుఁ గైదువులు దా మేమఱకుండుట
త్రోవల బావుల రేవులందు
నేఱుల విడిచలయెడఁ గపటంబులు
దెలియుచుఁ దిరిగి శోధించుటయును
తృణకాష్ఠజలములు దెచ్చుచోటులయందు
మిగుల నెచ్చరికతో మెలఁగుటయును
రేయును బగలు భూపాలుఁ గాపాడుట
చెప్పిన యట్లనె చేయుటయును

గీ॥ నివియ మొదలుగఁ గలిగిన యిట్టి వెల్ల
బలము లొనరించు పను లంద్రు తెలిసి చూడ
నిటులఁ జతురంగములపను లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 51

సీ॥ మంచిజాతియుఁ బరిమాణంబు వేగంబు
స్థానంబు వయసును సత్త్వములును
విలుకడ పనులందు నేర్పును దేజంబు
చెప్పినకైవడిఁ జేయుటయును

ఘనతయు భద్రలక్షణముల నాయువుఁ
గలిగి యెన్నికమీఱ మెలఁగుటయును
నిబ్బరంబును నేనుఁగులకును మఱియును
గాలిపందికిని లక్షణములెందు

గీ॥ ఇటుల బలముల లక్షణం బెఱిఁగి యెపుడు
వాని వానికిఁ జేయఁగా వలయు పనుల
యందు నియమింపఁగాఁ దగు హరువు లెఱిఁగి
నీతిమార్గం బెఱిఁగిననృపవరుండు ॥ 55

వ॥ చతురంగ బలముల నేలలకు. 56

గీ॥ గుంటలను మిట్టలను జెట్ల గొప్పతాళ్ళఁ
బుట్టలను మోటుచెట్టులు బొదలుగల్గి
మెలఁగఁగా వచ్చి ముండులు గలుగదేని
గాలిమూఁకల పనిసేయు నేల యంద్రు ॥ 57

వాజిభూమి

క॥ జలమును నడుసును నెఱియలు
గలుగక మ్రాకులును ఱాలుఁగడు లేక సమ
స్థలమై మెలఁగఁగ వచ్చుచు
నలరిన గుఱ్ఱములనేల యగు నంద్రుబుధుల్ ॥ 58

రథభూమి

సీ॥ ఇసుకలు మొద్దులు నెందెందె యుండక
బలుగుండ్లు నడుసు గుంటలును లేక
చేలును ముళ్ళును జెట్లుఁ దీగలు లేక
గుంతలుఁ బొదలు వాఁగులును లేక

నెఱియలు నొడ్డులు బొఱియ లేమియు లేక
పడి దాఁట గొరిసెత్తాఁకుడుల కోర్చి
కసుగట్టియై బండికండులు గలఁగక
చదరమై మిగుల విశాల మగుచు
గీ॥ నిసుడ మగుడంగఁ దగునట్టినేలలందు
సరదములు జగడముసేయ నమరుచుండు
నిట్టిజగడంపునేలల నెఱుఁగవలయు
సితిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 5॥

నాగభూమి

సీ॥ తివిచివేయఁగవచ్చుతీవియల్ గలయది
పట్టి విఱువవచ్చుచెట్టు గలది
యిసుకలు నసలుసు నెసఁగనియదియును
సేనల కెందు రాఁబోనియదియు
ఘనముత్తై కసుపట్టు గట్టులు గలయది
కడు సంట మిట్టలు గలుగునదియు
గలయంగ నుడుగువేరులుగలయదియును
నని సేయఁ గరులకు నర్హమైన
గీ॥ నేల యదిగాక యెటువంటి నేలయైనఁ
గరుల కగు వాని కెందు నగమ్యభూమి
గలుగకుండుట గాదె నాగంబు లయ్యె
నిట్టిభూముల నరవరుఁ డెఱుఁగవలయు ॥ 6॥

సీ॥ అనిమొన విఱిగినయశ్వాదిబలముల
నిలుపఁగా నోపుచు బలము రాజు
వెనుకదిక్కందు నిల్చిన ప్రతిగ్రహ మంచు
రదియు నిమ్నాఱువిండ్లంతదవ్వు

గలిగిన వెనుచక్కి నిలుకడగా నిల్చి
జగడంబు సేయింప జయము గల్గు
నటువలె రేకయ యనిసేయు నేబలం
బదియు వీఁగినబలం బనఁగఁ బరఁగు

తే॥ విల్లు గాపున జగడంబు లెఱుఁగురాజు
వెనుకదిక్కునఁ దా నిల్చి విఱిగి వచ్చు
వారిఁ గడు నాదుకొని నిల్పవలయు నెందు
వెనుక నిలేక పోరు గావింపరాదు॥ 61

దానకల్పన ప్రకరణము

మ॥ వరి యూథంబుల మీఁదఁ బెట్టుకొని వేగం బొప్పుతేజీల సం
పదయు న్వల్గడఁ గాపుగా నిలిపి యోగ్యంబైన యత్నంబుతో
నరనాథుం డెట నిల్చు నచ్చటనె భండారంబును న్నిల్పఁగాఁ
బరఁగుణ్ రాచఱికంబు నిల్పు నదిగా భండార మెంచం ధరణ్॥

కం॥ తొలుదొలుతఁ బొడిచి గెలిచిన
భళి భళి యని పిలిచి యొసఁగఁ బతి కగు సీవుల్
గలిగిన నెవ్వఁడు పొడువఁడు
చలమునఁ బైకుఱికి శత్రుసంఘముల నిలణ్॥ 63

సీ॥ పోరిలోఁ బగరాజుఁ బొడిచినవానికి
దాక్షిణ్య మొనరఁగా లక్షసంఖ్య
నతనికుమారుని నతనిసేనాపతి
నైనఁ జంపినవాని కందునగము
శత్రుసేనలలోన సన్నుతి కెక్కిన
వీరుఁ జంపినఁ బదివేలమాళ్ళు
పోటుమఁగను గడు మేటిప్రధానుని
నని గూల్చునతనికి నయిదువేలు

గీ॥ నహితుచనవరినై నను హయమునైన
వెనుకఁ దియ్యక చంపిన వెయ్యిమాళ్ళు
బంటుతలఁగొట్టి తెచ్చిన బంటునకును
బతి యొసంగఁగఁవగు రెండు పదులమాళ్ళు ॥ 64

కం॥ పరబలముల కెదిరింపుచు
నురువడి శౌర్యంబుఁజూపు యోధుల కెందుఁ
నరవరుఁ డినుమడి జీతం
బరయుచుఁ దా నియ్యవలయు సందఱు మెచ్చఁగ ॥ 65

గీ॥ ధరణినాథుల కర్హమై తగినయట్టి
కరితురంగాదివస్తువుల్ గాక యన్య
వస్తువుల నాజి గెల్చి యెవ్వార లెందు
నేమి దెచ్చినఁ బతి వారి కియ్యవలయు ॥ 66

కం॥ అనిలోన గెలిచి వచ్చిన
తనభటులకుఁ దగిన వస్తుతతి నొసఁగుచు నె
మ్మనముల సంతోషమ్ములఁ
గనఁ జేయఁగవలయు ధరణికాంతుం డెపుడుఁ ॥ 67

వ్యూహవికల్ప ప్రకరణము

వ॥ బారులు తీర్చుటకు. 68

సీ॥ మొనకు ముందఱ విలుమూఁకల నిల్పుచో
బారులనందున వారలకును
ధనువంతనేల యంతయ నెడఁగా నిల్పి
యచటికి మూఁడు వింట్లంతనేల

*(ఒంటొంటికిని నెడ నొప్పునట్టుల గుజ్జ
ముల బారు నిల్పఁగావలయు దాని)
వెనుక నేనుఁగుబారులను నిల్పఁగాఁ దగు
వానికి వెనుచక్కి వరుసతోడ

గీ॥ నెటుల సరదంబు బారుల నమర నిల్పు
నెపు ధనుర్మాన మనఁగ నీ యవనిలోన
నైదు మూరలపొడవగు నది యెఱింగి
వారి నిటు తీర్పవలయు భూపాలవరుఁడు ॥ 69

సీ॥ ఇట్టి దారులలోన నెడనెడ విలుకాండ్ర
కును వాజులకు నేనుఁగులకు మఱియు
సరదంబులకును బార్యాంతర భూముల
క్రమ మొప్పుచుండు నొక్కటియు మూఁడు
నైదు నైదగు సంఖ్య నమరిన శమముల
యంతదప్పుల నిల్చి యర్థ మొందు
నట్టి శమంబును నమరఁ జతుర్దశాం
గుళసంఖ్య ధరణిలోఁ దెలిసి చూడ

గీ॥ నిన్నియు నెఱింగి బారుల నిటులఁదీర్చి
పోరగాఁదగు నిదిగాక పోరఁ దనకు
నెటులఁ బొంకంబునందడి యెసఁగ దెటులఁ
జేరువగు నెటు లటులైనఁ బోరవలయు ॥ 70

వ్యూహరచనా ప్రకారము

వ॥ మఱియు బలంబులు దొట్రుకొనకయుండ ననేక ప్రకారంబు
లెఱింగి వ్యూహంబులు బన్ని జగడంబు చేయించవలయు
నవ్విధం బెట్లనిన గజానీకంబును, రథానీకంబును, మిశ్రానీకంబు,

[............................]

నన ననీకంబులు మూఁడు దెఱంగులై యుండు నందు గజంబులు తొమ్మిదియును, నందొక్కొక్క గజంబునకు ముందర జగడంబు సేయు గుఱ్ఱంబు లేనింటిచొప్పున నలుపదియైదు గుఱ్ఱంబులును నందొక్క గుఱ్ఱంబునకు ముందర జగడంబు సేయు వీరభటులు ముగ్గురి లెక్కను నూటముప్పదియైదుగురు వీరభటులును నిట్లు పాదసంరక్షణార్థంబు పార్శ్వంబులయందుఁ గాచికొనియుండు గుఱ్ఱంబులు నలుపదియైదును, వీరభటులు నూటముప్పదియైదు గురునుం గూడి తొమ్మిది గజంబులును, దొంబది గుఱ్ఱంబులును నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గలయది గజానీకం బనం బగు, నీ ప్రకారంబునఁ దొమ్మిది రథంబులును, దొంబది గుఱ్ఱంబులును, నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గల యది రథానీకం బనం దగు. తొలుదొల్త వీరభటులును, వారల వెనుక గుఱ్ఱంబులును వాని పిఱుందన రథంబులును, వాని వెనుచక్కి నేనుంగులునుం గలయది మిశ్రానీకం బన నొప్పు నిట్టి యనీకసమూహంబే వ్యూహం బనం బరగు, నదియు దండవ్యూహంబును, భోగవ్యూహంబును, మండలవ్యూహంబును నసంహతవ్యూహంబును నన నాలుగు దెఱంగులై యుండు. మఱియు నేతద్భేదంబులైన వ్యూహంబు లనేకంబులు గల వది యెఱింగి వ్యూహంబులు పన్నునపు డనీకానీకమధ్యంబున నైదేసి విండ్లంత దవ్వుగలుగఁ బన్నవలయు. నం దసంహతవ్యూహంబున ననీకంబులు దూరంబున నిల్చునట్లుగాఁ బన్నవలయు. నిట్టి వ్యూహంబునకు శుక్రమతంబువార ఉరోభాగం బొకండును బార్శ్వభాగంబులు రెండును, మధ్యపుచ్ఛభాగంబులు రెండునుం గూడి పంచాంగంబులుంగలవందురందునకుఁ దనకుంగల బలంబు మూఁడుపాళ్ళుగ నేర్పఱచి యురోభాగంబున నొకపాలును, బార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొక

పాలునుంగా నిలుపవలయునండ్రు. మఱియుఁ గొన్నిమతంబుల వారి పి పంచాంగవ్యూహంబునకే యంగంబున కొక్కొక్క యనీకంబు లెక్క సనీకంబులై దింటికి ముందర జగడంబు సేయు వార లాఱునూట డెబ్బదియైదుగురు వీరభటులును, నిన్నూట యిరువదియైదు గుఱ్ఱంబులును, నలువదియైదేనుంగులును నిట్లులె పాదసంరక్షణార్థబలంబునుంగూడి వేయినిన్నూట యేబదిసంఖ్య గల వీరభటులును, నన్నూటయేబది గుఱ్ఱంబులును, దొంబది యేనుంగులునుం గలిగి యుండవలయు నండ్రు. వెండియు బృహస్పతిమతంబు వార లీ పంచాంగవ్యూహంబునకే కక్షభాగంబులు రెండునుంగూడి సప్తాంగంబులం బ్రవర్తిల్లునంమిరందునకుం గల బలంబు నాలుగుపాళ్ళొనరించి యురోభాగంబుల నొకపాలును, గక్షభాగంబుల నొకపాలును, పార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొకపాలునుంగాఁ బన్ని జగడంబు సేయించవలయు నం డ్రండు. 71

సీ॥ తమలోనఁ దాము సందడిపడి కలయక
యని యొనర్పఁగఁ దగు నదియుఁ గాక
కలిసి పోరాడ సంకుల సమరం బగు
నట్టి సందడికయ్యమందు నెల్లఁ
దమయేనుఁగుల దండఁ దాఁగొని జగడంబు
సేయఁగావలయు నజేయలీలఁ
దమమూఁకమీఁద గుఱ్ఱములు పైకొన్నచో
నొండొరుల్ చెదరకయుండి పోర

గీ॥ వలయు బాణంబులును దుపాకులును విండ్ల
మూఁక ముందర నిడికొని మొనకు నడచి
యొట్టి మూఁకలు పైకొన్న నట్టిమూఁక
చేతఁ బోరింపవలయును క్షితివరుండు॥ 72

## ప్రకాశ యుద్ధ ప్రకరణము

వ॥ సేనాంగాలకుఁ బ్రత్యేకనాయకులకు. 73

చం॥ కులమున మించువారిఁ దమకుం దగువారై తగువారిఁ బోరిలో
నలవడి తత్ప్రతిక్రియల నన్నియుఁ జేయ నెఱుంగువారిఁ గ్రొ
వ్వల దమమ్మూఁకఁ గాపఁ గలవారల నేనుఁగు లాదియైన మూఁ
కలకును వేఱువేఱ నధికారులఁగా నియమింపఁగాఁ దగున్॥ 74

కం॥ ఈరీతి వ్యూహములుగా
నేరుపుతోఁ బన్నినట్టి నిజబలములచే
వైరిబలంబుల మీఱి వి
దారింపఁగవలయుఁ గదిసి దళవాయి తగన్ ॥ 75

కం॥ బలిమిగల వైరిబలముల
బల మిసుమడి గలిగినట్టిబలములచేతన్
గెలువఁదగుఁ దెలిపి చూపని
బలముల నేనుఁగులఁ బఱపి పఱపఁగవలయున్ ॥ 76

### గజబలప్రశంస

లయగ్రాహి॥ మెండగు శిరాలురముదండ బలుకేదెములు
నిండుకొను గుమ్మలును దండితలరాణున్
గండమర బూనుచుఁ బ్రచండమదమత్తులగు
దండిమగ లేమఱక భండనములో సు
ద్దండగతి లోహమయదండములు బూనుకొని
నిండుసమజోకఁదగుచుండు పరసేనం
జెండఁ జనునందుఁ గలగుండుపడ వాద్యముల
డిండిమ డిమండిమ డిమండిమ తెసంగన్ ॥ 77

చం॥ ఘనుఁడగు మావటీఁడు మొనగాలునఁ గేలున నంకుశంబునన్
దను బురిగొల్పఁ దొండము ముదంబునఁ జాపుచు వాలమెత్తుచున్
గనుగవయుం జెవుల్ నిగుడఁగాఁ దనసేన నెఱింగి శత్రుసే
నను నుఱుమాడి గెల్పు నరనాథున కిచ్చుఁగదా గజం బనిన్॥ 78

ఉ॥ ఏనుఁగు లున్నచోనె పసియించును శ్రీహరిరాణి సంతతం
బేనుఁగు పోఁ జూగల్గుదొర యేమిట నోటమిఁ జెందఁ డెట్టిచోఁ
గాన మదేభయూథ మధికంబుగఁ గొల్వఁగ దంతి నెక్కి సం
గ్రామముతోడి దుర్గము నృపాలకుఁ డెక్కిన యట్లు పోరిలోన్॥

చం॥ తొడరు భయప్రదేశముల దుర్గములై వడిఁ బాఱు నేయిలన్
గడవఁగ నోడలై రణముఖంబున రాక్షసులై ప్రయాణముల్
వెడల గృహంబులై మనసు మెచ్చగఁ జూడను గారణంబులై
కడుమద మెచ్చు నేనుఁగులె రా జయసాధనముల్ దలంపఁగన్॥

చం॥ బలిమి మదంబునుం గలుగు భద్రగజంబుల రాజు శత్రుమూఁ
కల నుఱుమాడి చెండుగఁ గకావికచేసి జయించు నేనుఁగుల్
బలుపుగ గల్గినన్ జయము ప్రాఁతియె కావున వానిఁ బ్రోవఁగా
వలయు నృపాలశేఖరుఁ డవశ్యముఁ దా జయలక్ష్మి మించఁగన్॥

సీ॥ పొగడపువ్వులతావి పోదివి ఘుమల్ కొన
పెదటల్లి సంతతమదముఁ గల్గి
తేనెవన్నియ గల్గి దీప్తమై పొడవులై
వలుదలై పొలుచు కొమ్ములును గల్గి
దొరయుచు సమములౌ తుంటి దిక్కులుగల్గి
యొద్దికై కూడి పెన్నుద్దు లనఁగ
వెరయుచుండెడునట్టి బృంహితస్వనములు
సమములైనట్టి యంగములుగలి

గీ॥ సకలశుభలక్షణంబులు చక్కఁదనము
చెలువు గంభీరగమనము గలిగినట్టి
భద్రగజముల నేలుభూపాలకుండు
సకలసంపదఁ జెలువొందు జనులు వొగడ ॥ 82

చం॥ గజములు గల్గు భూవిభుఁడు గా నొకదిక్కున గాక యెల్లచో
గజములు గల్గువాఁడు ధరఁగల్గడు కావున దంతికోటులన్
గజముల లీల సత్త్వములఁ గన్నడు బంటులఁ జాల నేలినన్
విజయము తేజమున్ సిరులు విశ్రుతకీర్తులు గల్గు ధాత్రిపున్ ॥

రథబల ప్రశంస

ఉ॥ ఘోరతగల్గు సారథులు చొక్కపు తేజులు కింకిణీరుచిర
త్కారమహారవంబు బిరుదధ్వజకోటులు మీఱఁ బోరిలో
వైరిమనోరథంబులను వానిరథంబులఁగూల్చి పొల్చు బల్
తేరులవారు గల్గునరదేవున కెద్ది యసాధ్యమే ధరన్ ॥ 84

అశ్వబల ప్రశంస

కం॥ ఏటికిఁ గరు లేటికి నరు
లేటికి మఱి రథచయంబు లీధరలోనన్
నీటగు జయము లొసంగెడి
ఘోటకములె చాలఁగలఁ గువలయపతికిన్ ॥ 85

సీ॥ నిలిచెనా యడుగులోనే నిల్చి చిత్రమై
కదలెనా బాణవేగము దెరల్చి
యనినిఁ గైదువుల సాధనకానిగతిఁ బొల్చి
దాఁటెనా లేఁడిచందం బదల్చి

గమకించెనా సింహగమనంబు గమకించి
యడఁగెనా తాఁబేటియనువు మించి
చుట్టెనా వేడెంబు సుడిగాడ్పు నదలించి
బెళికెనా బేడిసబెళుకు బెళికి

గీ॥ యెడమ కుడి వాగెబాగుల నెఱిఁగి తిరుగ
నిరుదెఱఁగుమోము లనఁదగి హరువు మురువు
వెఱవు నొఱపును గడుమించు నరుడు బిరుదు
నదుటు నుదుటొందు తేజి రాజార్హమంత్రు॥ 86

చం॥ తలఁప నవేళలన్ మిగులఁ దాఁ దగులై తగునట్టి చుట్టమై
యల రణభూమి పేరఁదగు సంబుధి దాఁటగ మేటితెప్పమై
సలరగఁ గ్రీడలన్మెలఁగు నప్పుడు దా వెలలేని రత్నమై
చెలఁగెడు గుఱ్ఱ మేహితము సేయదు నాయకుఁ డైనవానికిన్॥

చం॥ బలువగు కందముం బిరుదు బంగరుచాయహసించు సంపదల్
గల పరిపూర్ణదేహము విలాసముఁ జక్కఁదనంబు నోజయుం
గళలును జెల్వు తేటతెలిగన్నులు లక్షణముం జవంబునుం
గలిగిన తేజులన్ సిరులు గైకొను భూభుజుఁ డేలఁగాఁ దగున్॥

కం॥ ఏ నరపతి గుఱ్ఱంబుల
సేనలచే మిగులఁ బ్రబలు క్షితిలో నెపుడున్
వానిది సిరి వానిది ధర
వానిదె జయలక్ష్మి కీర్తి వానిదె సుమ్మీ॥ 89

చం॥ ఈగతి నీతిమార్గమున నెంతయు సుస్థిరుఁడైన రాజు దా
ధీగరిమన్ వహింపుచును దిగ్విజయంబును సర్వసంపదల్
భోగము గల్మియుం గలిగి భూవిభులెల్లను జేరికొల్వ ను
ద్యోగము లెల్లఁజేకుర సుఖోన్నతి రాజ్యముసేయు నిచ్చలున్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభృంగ ఘనాసమానసో
దార మదారివీరవరదర్పవిమర్దన దుర్దమప్రియా
స్ఫారభుజాబలాధిక విసారిత పూరితలోక సత్యశో
హారవిహారమానితమహాకరివాజివిరాజితాంగణా ॥ 91

మంగళమహాశ్రీ ॥
శ్రీమహితభానుత సంభృతశాస్త్రవిశిష్టహితభాసిత గుణశ్రీ
కాముకరక్షాకృతినికాయకృతివర్ధిత ప్రకాశిత నయాధిప జయశ్రీ
రామ భీమభామ శరరాజి సురరాజ చరరాజిత విశాలభుజయుక్ శ్రీ
భూమిరమణీయనిజభూజనసుఖప్రదప్రభుత్వయుత మంగళమహాశ్రీ

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర చక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు సేనావివరణంబును, సేనాపతిప్రభావంబును గూటయుద్ధప్రకారంబును చతురంగబలప్రయోజనంబులును వద్యూహములును వ్యసనంబులును పారితోషికంబును చతురంగబలప్రశంసయు నున్నది సర్వంబు నష్టమాశ్వాసము.

మ॥ రమణీయంబుగ శాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూటయును నాలునై వెలయఁగా బ్రౌఢిం దెనింగించి రా
ర మహిం దిమ్మయ వెంకటాద్రి విభుపేరన్ వేడ్కఁ గామందకీ
యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభాస్వద్దంబునన్ రూఢిగన్ ॥

శ్రీ శ్రీ శ్రీ

Rathna Press, Tirupati — 1950.